


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కలిగిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**

SAA/AMS/2197 TEL

# ఎక్కువ పోషక పదార్థాలు గల
# గ్రోమోర్ 14-35-14
# వాడండి.

## అది సాటిలేని దిగుబడులతోబాటు, ఖర్చులో ఆదా చేస్తుంది.

### ఏవిధంగా అంటే :

గ్రోమోర్ 14-35-14 లో మొత్తం 63 శాతం పోషక పదార్థాలు వున్నాయి. కనుక, అత్యధిక పోషక పదార్థాలుగల గ్రోమోర్ 14-35-14 వాడినప్పుడు మీ పైర్లకు అత్యుత్తమ పోషణ ఇవ్వడానికి తక్కువ మోతాదులు వేస్తే చాలు. మీకు సాటిలేని దిగుబడులు లభించడమే కాకుండా, ఎరువు ఖర్చులో కూడా ఆదా వుంటుంది

గ్రోమోర్ 14-35-14లో చాల ఎక్కువ పాళ్లలో వుండేది విలువైన ఫాస్ఫేటు. ఫాస్ఫేటు మొక్కలకు తొలిదశలో అత్యవసరమైన బలాన్ని అందిస్తుంది. అట్టి ఆది బలం పుంజుకుంటేనే మొక్కలు చివరిదాకా దృఢంగావుండి మరింత దిగుబడులనిస్తాయి ఆది బలమే ఆద్యంతం వుండే బలం కూడ. ఈ విధంగా, మీరు పెట్టే ప్రతి రూపాయి ఖర్చుకు ఎన్నో రెట్లు లాభం వస్తుంది

అంతేకాదు, గ్రోమోర్ 14-35-14 లోని పోషక పదార్థాలు మొక్కలకు పూర్తిగాను, సులభంగాను లభ్యమయ్యేలా రసాయనికంగా కలసివున్నాయి. ఫాస్ఫేటు నీటిలో కరిగేది కాబట్టి మొక్కలు దానిని పూర్తిగా వినియోగించుకోగలుగుతాయి. నత్రజని వృధా కాకుండా, అమోనియా రూపంలో మొక్కలకు అందుబాటులో వుంటుంది అందుకే గ్రోమోర్ 14-35-14 వాడితే సాటిలేని పోషణద్వారా మీరు పెట్టే ఖర్చుకు పూర్తి విలువ లభిస్తుంది.

## గ్రోమోర్
## 14-35-14








చేనుకు చెవి,
రైతుకు రొక్కం- గ్రోమోర్




కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
126, సరోజినిదేవిరోడ్, సికింద్రాబాదు-500 003

FDSH-CR-776 TL

## లోకం పోకడ — ఉమ్మెన్














**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం : 15–7–'77

పింగళనామ సం. అధిక ఆషాడమాస బ.చతుర్దశి

**సంపుటము 70 : సంచిక : 46**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41–60
ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

## అట్టమీద బొమ్మ

4.6.77 మా [మా] పత్రిక వీక్లీ శారద ముఖచిత్రంతో చాలా ఎక్సెలెంట్‌గా వెలువడింది. ముఖచిత్రంలోని అందం కళ్ళకు ఆకట్టుకునేలా వుంది. క్రొత్త సీరియల్ తమ సామాజోతిర్గమయ మొదట్లోనే మమ్మల్ని అమితంగా ఆకర్షించింది. ఇందులో వాస్తవికత వుట్టిపడ్డట్లు కనపడుతూంది. కథలు మూడున్నా చదవటానికి ఫర్వాలేదనిపించాయి.

పి.జి. పట్నాయక్, డి.సూర్యనారాయణ, (బవుద్‌రాజ్)

* * *

24.6.77వ తేదీ అందాల నటి శారద ముఖచిత్రంతో వెలువడ్డ ఆంధ్రసచిత్రవారపత్రికవండర్‌ఫుల్. నీతిని బోధించే ధర్మపథం శీర్షిక పత్రికకే హైలెట్. 34వ పేజీలోని తులసీరాంగారి కార్టూను కడుపుబ్బ నవ్వించింది. ఎప్పుడూ మా పత్రిక యిలాగే నవ్విస్తుండాలని నా ఆశయం.

అబ్దుల్ సలావ్. (ఆల్వాన్‌పల్లి)

* * *

24.6.77 ఆంధ్రసచిత్రవారపత్రిక సంచికలో రామచంద్రంగారి కోమలి — కోరిక కథ చాలా రమణీయంగా వున్నది. ఈ పత్రికలో లోకం — పోకడ అను ఉమెన్ కార్టూన్లు, కడుపుబ్బనవ్వించుచున్నవి. ఒక కన్య చెప్పినకథ సీరియల్ ఎంతో సహజమైన సంఘటనలతో చాలా చక్కగా సాగుతుంది.

యస్. హెచ్. సింగ్, యం. శంకర్, (కరీంనగర్)

* *

ఆంధ్రుల అభిమాన పత్రికగా ఆంధ్రపత్రికకు ఒక ప్రత్యేకమైన స్థానం వున్నదన్న నిజాన్నికాదనలేరన్న ధైర్యం ఈ కలానికి వుంది. గత నాలుగు వారాలుగా అంగ విన్యాసాల్ని ప్రదర్శించే యువతుల చిత్రాలను ముఖ చిత్రాలుగా వేయటంవల్ల తాత్కాలికంగా మార్కెట్ పెరిగితే పెరగవచ్చునేమోగానీ




పాఠకులకు పత్రిక పట్లవున్న గౌరవ భావం పోయే ప్రమాదం వుందని చెప్పటానికి విచారిస్తున్నాను. కాబట్టి ముఖచిత్రాల పట్ల శ్రద్ధవహించి అసభ్యతకు తావులేకుండా చూడవలసిందిగా పత్రిక అభిమానిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను ...

ఎమ్. ఎస్. ప్రసాద్. ( కాశీబుగ్గ )

* *

24.6.77 తేదీ నాటి మా ఆంధ్రసచిత్ర వారపత్రిక శారద ముఖ చిత్రంతో సింగారించుకున్నట్లుంది. ఇటువంటి అందమైన ఫోటో దించిన జే. వి. గార్కి అభినందనములు. కథలలో ఫణి కథ చాలా చాలా బాగుంది.

బొడ్డేపల్లి నారాయణమూర్తి, (అక్కులపేట)

* * *

శారదముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రవార పత్రిక మనసుకి విందు చేసింది. అక్షర నీరీక్షణ యువభావానికి, నవజీవనానికి అద్దం పట్టిందని చెప్పొచ్చు. సామాన్యుడి సణుగుడు లేక పోవడం మాకంత బాగాలేదు.

సుధాంధు, రవికుమార్, (నూజివీడు.)

* * *

మా (మా) 1.7.1977 వారపత్రిక ముఖ చిత్రం వర్ధమాన నటి కుమారి జయసుధ ముఖ చిత్రము అంతగా ఆకర్షించలేక పోయినా విముక్తి, ఉప్పుకల్లు కథలు మమ్మలను చాలా ఆకట్టుకొన్నాయి. ఈ నాటి సమాజములో రాజారావులాంటి వ్యక్తులు ఎందరో ఉన్నారని శ్రీ కె రామమోహన రావుగారు రచించిన విముక్తి ద్వారా తెలుసుకున్నాము.

సి.. హెచ్. రామారావు, వై. సత్తిబాబు ( గజపతి నగరం.)

### సి ని మా

విజయనిర్మల గారిని శ్రీనివాస్‌గారు పదేపదే మాడమ్ గా సంబోధిస్తున్నారు. ఏమిటో కిటుకు? రోజారమణి వాణిశ్రీ లెవల్ నటన్ను ప్రదర్శించారట .... అంటే ఏ లెవల్ ? అడవి రాముడు సినిమాకి వచ్చేంతప్రజ బ్రహ్మాన్ని వానికికూడా రాలేమో ! .. నని — శ్రీనివాస్‌గారి ఉవాచ....అడవిరాముడు ప్రదర్శింపబడ్డ తున్న థియేటరులోని ఒక షోకి వచ్చే ప్రజ, ప్రదర్శింపబడిన మొత్తం రోజుల ప్రేక్షకుల సమూహమో లేక దేశం మొత్తం మీద ఆ సినిమాకి వచ్చే ప్రజో సెలవియ్యలేదు..

ఫలానా నవరస భరిత ముఖ్య పాత్రకి న్యాయం చెయ్యగల నటి జమున ఒక్కతేనని అభిప్రాయ పడ్డారు శ్రీనివాస్‌గారు. ఇంతకీ సదరు నిర్మాత అదృష్టవంతుడే.

ఎ. జ్ఞానేశ్వర్‌రావు, (సిద్ధిపేట)

### క థ లు

24.6.77 నాడు వెలువడిన సచిత్రవార పత్రిక మాకు చాలా నచ్చింది. ఇందులోని కథలు మూడు ముచ్చటగా ఆసక్తి దాయకంగా వున్నాయి. ముఖ్యము ఫణి కథ చాల నచ్చింది.

టి. ఈశ్వరయ్య, ( మెదక్. )

## "లావా" చేపల ఆహారమా ?

అగ్నిపర్వతాలు అత్యంత భయంకరమైన ప్రకృతి ఉత్పాతాలలో భాగం. ఈ అగ్నిపర్వతాల ప్రేలుళ్లు మైళ్లకు మైళ్ళు పర్యతం సమస్త సచరాచర జీవరాసి నంతటినీ పూర్తిగా తుడిచి పెట్టిన చరిత మనకు కోకొల్లలుగా కనిపిస్తుంది. ఈ అగ్నిపర్వతాల నుంచి ప్రవహించే లావా ప్రవాహం అనేక నగరాలను భస్మీభూతం చేసి, అక్కడ ప్రాణులన్నింటినీ తుడిచి పెట్టింది. సముద్ర గర్భంలోనూ లేదా భూమి పెంకు క్రిందా యీ అగ్నిపర్వత ప్రకంపనలు భూకంపాలకు కారణ మవుతాయి.

ఈ అగ్ని పర్వతాల ప్రేలుళ్ళు మృత్యువునూ, సర్వ వినాశాన్నీ కొనితెస్తాయి. అయితే ఈ భయంకరమైన లావా ప్రవాహం, పర్వతాల నుండి క్రిందికి జాలువారి, త్వరగా చల్లబడుతూ మైదాన ప్రాంతాలను చేరేటప్పుడు, ఆ బూడిద విశాల ప్రాంతాలను కప్పివేస్తుంది దీనివల్ల అగ్ని పర్వత బిలం నుండి పదుల కిలోమీటర్ల దూరం పర్యంతమూ దట్టమైన పొర ఏర్పడుతుంది. ఇక్కడ కూడా జీవరాసి స్తంభిస్తుందా ? నదులలోకి, సరస్సు లోకి ప్రవహించే యీ లావా ప్రవాహపు బూడిద వ్యతిరేక ఫలితాలను యివ్వదనీ, పైపెచ్చు చేపల సంతతి పుష్కలంగా పెరగడానికి తోడ్పడుతుందని కంచత్కా [ సోవియట్ దూర ప్రాచ్యం] అగ్నిపర్వత పరిశోధకులు యిటీవల కొనసాగించిన అధ్యయనాలు తెలుపుతున్నాయి.

ఈ బూడిదలో అనేక ఖనిజాలు, లవణాలు సమృద్ధిగా వుంటాయి. ఇది త్వరగా నీటిలో కరిగిపోయి, నీటి నాచు బలంగా పెరగడానికి ఉపకరిస్తుంది. ఇది చేపలకు బలకరమైన ఆహారంగా ఉపకరిస్తుంది. లావా ప్రవాహాల బూడిద ఎక్కువ పడిన అజ్బావెయగా సరస్సులోని జీవజాలాన్ని యీ పరిశోధకులు ఇటీవల గమనించి, దీనిలో మత్స్య సంపద అపారంగా పెరిగిందని నిర్ధారించారు.

సీరియల్

# తమసోమా జ్యోతిర్గమయ



ఎం.పి.ఆర్. రాధాకృష్ణ

*(గత సంచిక తరువాయి)*

> ***జరిగినకథ 3:*** చలపతిరావు, కామాక్షమ్మలకు సుజాత ఒక్కతే కూతురు. సుజాత పెద్దన్న రామం ఉద్యోగంలేక, చిన్నన్న మురళి నాటకాల పిచ్చిలోను తిరుగుతుంటారు. సుజాత, అరుణ, రజని క్లాస్‌మేట్స్. అరుణ టెన్నిస్ ఆడే శేఖర్‌ని ప్రేమిస్తుంది. తన పెళ్ళికి కట్నంకోసం ఇల్లమ్మాలనుకోవటంతో అసలు పెళ్ళే చేసుకోనంటుంది సుజాత. పరధ్యానంగా నడుస్తూ బస్సుకింద పడబోతున్న సుజాతని రక్షిస్తాడు విక్టర్.

"ఇంకా బూజుపట్టిన పాత భావాలనే పట్టుకు వ్రేల్లాడితే ఎలా? రోజులు మారుతున్నాయి. వాటితోపాటు మనమూ మారాలి. తప్పదు..." అంది అరుణ ఆవేశంగా!

"ఆగవే అమ్మడూ! 'వెయిటింగ్‌రూం'లో కూర్చొని లెక్చర్లు దంచడమంత సులభం కాదు, మారడమంటే! పూటకొక చీర మార్చినంత సులభంగా మారిపోవు మనుషుల మనసులు..." అంది రజని!

అంతకు ముందురోజు జరగబోయి తప్పిపోయిన ప్రమాదం గురించి, ఆ తరువాత తల్లి అభ్యంతరాన్ని గురించి సుజాత చెప్తే దానిమీద స్నేహితురాళ్ళిద్దరూ వెలిబుచ్చిన అభిప్రాయాలివి!

"మారాలి రజనీ! మారితీరాలి. తారతమ్యాలు చూపించే రోజులు పోయాయి ఏనాడో! ఇప్పుడు అందరూ వక్కటే" అంది అరుణ అదే ఆవేశంలో!

"అలా అని ఎవరన్నారట!"

"భగవంతుడు. అతనిదృష్టిలో అందరూ సమానమే!"

"నిజం చెప్పావు. కానీ, మనం మాట్లాడేది మానవమాత్రుల గురించి. మనిషి భగవంతుడైననాడు నువ్వు చెప్పిందే కరెక్ట్" అంది రజని, చిన్నగా నవ్వి!

అరుణ అంగీకరించలేదు... "నువ్వెన్ని చెప్పు మనుషులంతా వక్కటే అందరిలో వకటే రక్తం... ఒకేవిధమైన అవయవ నిర్మాణం... అటువంటపుడు ఈ విభేదాలెందుకు?" అంది.

రజని మళ్ళీ నవ్వింది! "నువ్వు మాట్లాడేది అనాటమీ! నేను చెప్పేది సైకాలజీ. ఈ రెండింటికి చాలా వ్యత్యాసముంది. ఆ వ్యత్యాసంయొక్క ప్రతిరూపమే మనిషి! ఎలుక్కి పిల్లి శత్రువు. కుందేలుకి నక్క శత్రువు. లేడిపిల్లకు పులిశత్రువు. కానీ విచిత్రమేమిటంటే... ఈ భూమ్మీద మనిషికున్న ఏకైక శత్రువు... మనిషే! తోటి వ్యక్తిని వ్యక్తిగా గౌరవించలేని అనాగరికత ఒక్క మనిషిలోనే ఉంది. ప్రపంచమంతటా ఈ అనాగరికత స్పష్టంగా కనిపిస్తోంది. సివిలిజేషన్ బాగా పెరిగిన దేశాలలోనే తోటి మనిషిని బానిసని చేశారు. మనిషి రంగుకే ప్రాధాన్యతనిచ్చి కొందరిని అణగదొక్కుతున్నాయి, కొన్ని దేశాలు. కులానికి, మతానికి నివాళులుపట్టి సున్నితమైన సెంటిమెంటును పరమఛాందసమైన ఆచారాలుగా మార్చి, ఆ చీకటిలోనే గ్రుడ్డి బతుకులు బ్రతుకుతున్నారు కొందరు.

"వాళ్ళకూ తెలుసు రక్తం, రంగు, అవయవ నిర్మాణాలు ఒకటేనని. కానీ ఒక మనిషిమీద వేరొక మనిషి ఆధిక్యత కలిగి ఉండాలనే ప్రయత్నిస్తాడు. ఈ బలహీనత సృష్టిలోనే ఉందేమో! వేరే ప్రత్యేకమైన ఆధిక్యతలు లేనివ్యక్తి, తన పుట్టుకను ఎరువు తెచ్చుకుంటాడు. తను గొప్పవాడు కాకపోతేనేం... తన పుట్టుకే గొప్పదంటాడు. దేముడే తనని ప్రత్యేకంగా పుట్టించాడంటాడు. అదొక వెర్రి ప్రలోభం. దానిలోనే తృప్తి!

కాబట్టే.. నువ్వనుకున్నంత సులభంగా మారిపోదు, సమాజం. ఎందుకంటే.. వాళ్ళు నమ్ముకున్న తారతమ్యాలమధ్య అంతులేని స్వార్థముంది. స్వార్థాన్ని జయించగలిగిననాడే.. నువ్వుచెప్పే మార్పు సాధ్యం." అంది!

"నిజమే! అందుకే ఎన్నిచట్టాలుచేసినా.. సంఘసంస్కర్తలు ఎంతగా ప్రయత్నించినా, కొన్నిదురాచారాలు నానాటికి ప్రబలుతున్నవే గాని.. నశించి పోవడంలేదు." అంది, సుజాత!

"సంఘాన్ని సంస్కరించాలనే అందరూ అంటున్నారు. ఏచోట విన్నా అదేమాట. అయితే ఈ సంఘమనేది ఎక్కడుందట? అది మనలోనే ఉంది. లేదా..మనమే ఉన్నాం దానిలో! కాబట్టి..ముందుగా మారవలసింది మనం.గమ్మత్తేమిటంటే.. మనిషి దినదినానికి మారుతూనే ఉన్నాడు.. ఆమార్పు తనకు అనుగుణంగా ఉంటే! అంటే ఏదైనా మార్పురావాలంటే.. ఆ మార్పుతెచ్చేమంచి, చెడులను కూడా మనిషి బేరీజు వేసి చూసుకుంటాడు. మనిషి దృష్టిలో.. మంచి,చెడుల నిర్వచనంవేరు. తనకు అక్కరకు వచ్చేదే మంచి.. అక్కరకురానిదే దైనా చెడే...!

ముఖ్యంగారెండు సంస్కరణలనుగురించి చూద్దాం. రాజా రామమోహనరాయలు సహగమనాన్ని వ్యతిరేకించాడు. కందుకూరివీరేశలింగంగారు..విధవలను, పతితలను ఉద్ధరించాలనే తలంపుతో ఉద్యమాన్ని లేవదీశారు. మొదటిది బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది. రెండవది..ఈనాటికి దిగంతాల అవలేఉంది. కారణం ఏమిటంటారు మీరు? మనిషిలోని భయం మొదటి దానివిజయానికి కారణమైతే.. అదేమనిషిలోని స్వార్థం. రెండవ సంస్కరణ వైఫల్యానికి కారణం. సహగమనాన్ని ప్రోత్సహించినా, అమలుజరిపినా చట్టం చాలా నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తుంది.కానీ విధవలను పెళ్ళిచేసుకొని తీరాలని నిబంధనలు లేవు. పతితలనుద్ధరించాలని నియమంలేదు. ఇదివ్యక్తియొక్క మనసునకు సంబధించినది. అంటే చట్టరీత్యాతేదగిన సంస్కరణలు కొన్నయితే మనిషి మనసును తట్టిలేపి నిజాన్ని చూపించే సంస్కరణలు మరికొన్ని అందుకని ఈరెండవ కోవకు చెందినవి. అంతసులభంగా అమలు జరుగవు. పరిస్థితులు ఇలానేకొనసాగితే అసలు అమలుజరగక పోవచ్చు కూడా!

వల్లమందు మత్తుల్లా, తాగుడు విషాలా

మనిషి కొన్ని అతీత నమ్మకాలకు బానిస. కాబట్టి సంఘ సంస్కర్తల కృషి తగిన ఫలితాన్నివ్వడంలేదు'' అంది రజని.

''పోతే పోయిందిగాని నీ ఉపన్యాసం మాత్రం బ్రహ్మాండంగా ఉందే'' అంటూ మెచ్చుకుంది అరుణ చిన్నగానవ్వి.

''నాది ఉపన్యాసమే! నువ్వేమో చేసి చూపించాలను కుంటున్నావ్. కాబట్టి నువ్వే గొప్పదానివి'' అంది రజని అదోలానవ్వి. ఆ మాట అంటున్నపుడు సుజాత వైపు కీగంట చూసింది.

సుజాత రజని చూపుల్లోని అంతరార్థాన్ని గ్రహించి, మాట్లాడవద్దన్నట్లు సైగ చేసింది.

రజని సుజాత సైగను లక్ష్యపెట్టలేదు.

''అరుణా! ఒక్క ప్రశ్న వేస్తాను ఏం అనుకోకు'' అంది.

''అంతగా అనుకునే ప్రశ్నేముందబ్బా'' అని వింతగా చూసి. ఫరవాలేదు, అడుగు. మనలో మనకు అనుకోవడాలేమిటి?'' అంది అరుణ.

''నువ్వు శేఖర్‌ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావు అతనూ నిన్ను అంత గాఢంగానే ప్రేమిస్తున్నాడంటావా?''

ఊహించని ప్రశ్నకు అరుణ ముందు తెల్లబోయినా అంతలోనే తేరుకొని అంది.

''ఎందుకా సందేహం?''

''సందేహం నాదేలే! తొందరపడి మగ వాళ్ళను నమ్మకూడదంటారు శేఖర్ మంచి వాడే కావచ్చు. కానీ...'

''కానీ ... అతను కూడా అందరి వంటి మగరాయుడే అని నీ అభిప్రాయం అంతేనా?'' అరుణ సూటిగా చూస్తూ అంది.

''కాడని గ్యారంటీ ఏమిటి?''

''లేదు! అయినా! నమ్మకం అంతే!''

''నీ నమ్మకం పొరపాటని రుజువైతే?''

''ఉన్నపళంగా మనం కూర్చున్నచోట భూమి బద్దలయితే? - ఇదీ అంతే'' అరుణ నవ్వింది.

రజని కూడా నవ్వి అంది ''అంత గాఢంగా ప్రేమిస్తున్నావా అతన్ని?''

''ఏం? కూడదా?''

''కూడదనికాదే! మాటవరసకి శేఖర్ నిన్ను కాదని వేరొక అమ్మాయి వెంట పడ్డాడే అనుకో... ఏం చేస్తావ్?''

''అది అతని ఖర్మ...'' అరుణ చాలా తేలిగ్గా అంది.

''అయితే నువ్వేమీ అనుకోవా?'' రజని ఆశ్చర్యంగా అడిగింది.

''ఎందుకనుకోను? నమ్మించి మోసం చేశాడని బాధపడతాను. అంతకంటే ఎక్కువగా అనుకోవడానికేముంది?''

''ఏమీలేదా?''

అరుణ గట్టిగా నవ్వి అంది! ''ఏమిటే అలా తెల్లబోతావ్! ఒకవేళ అయితే, గియితే నువ్వన్నట్లే జరిగిందనుకో! ఏం చెయ్యమంటావు నన్ను! బావిలో ఉరక మంటావా? వంటినిండా పెట్రోలు పోసు కొని నిప్పంటించుకోమంటావా? లేకపోతే సినిమాలలోలా విషాద గీతికలు ఆలాపించ మంటావా? కాస్తేతే ఓ వారం రోజుల మూడ్ పాడవుతుంది. దట్సాల్...''

''ఏమిటో అనుకున్నానుగాని ... నువ్వు చాలా గట్టిదానివే'' అంది, రజని... అరుణ వైపు ఆశ్చర్యంగా చూస్తూ!

సుజాత కల్పించుకొని అంది! ''ఇది గట్టిదో కాదో తెలీదుగాని నువ్వింత మొద్దువని నేను అనుకోలేదు. దాని గట్టితన మంతా మాటలోనే! నిజమైన మనుగాన నమ్మితే... నవ్వులో కాలేస్తావ్!''

సుజాత మాటలకు అరుణ నవ్వేసింది!

* * *

రజని అన్నగారి పేరు నిరంజన్! బి. కాం పాసై చదువు మానేసి, తండ్రికి వ్యాపారంలో సహాయంగా ఉంటున్నాడు. అతనికి వివాహమైన ఏడేళ్ళకు పుట్టింది, ఓపాప! అందుకని బాల సారె ఘనంగా ఏర్పాటు చేశారు.

ఆ సందర్భాన్ని పురస్కరించుకొని అరుణను సుజాతను ఆహ్వానించింది రజని! పాపకోసం అరుణ చిన్న బంగారపుటుంగరాన్ని కొంటే సుజాత మాత్రం ఒక చిన్నగౌను తీసుకుంది. ఇద్దరూ అనుకున్న సమయానికి కలిసే వెళ్ళారు రజని యింటికి!

గుమ్మంలోనే ఎదురై స్వాగతం పలికింది, రజని! ఇంతలో రజని వదినగారు శశి, తండ్రి శివరామ్‌గారు కూడా వచ్చియిద్దరినీ పలక రించారు సుజాత, అరుణ కాక రజని కుటుంబ స్నేహితులు, బంధువులు కూడా చాలా మంది వచ్చారు

నిరంజన్ స్నేహితులు ఒక్కొక్కరుగా వస్తున్నారు. వచ్చినవారిని కూర్చోబెట్టి. వాళ్ల



అవసరాలు గమనించడంలో ఇంటిల్లిపాది చాలా హడావుడిగా ఉన్నారు.

అరుణ, సుజాత కూడా అందరూ వద్దని వారిస్తున్నా వినకుండా ఏర్పాట్లలో సహాయానికి దిగారు.

సుజాత 'రిఫ్రెష్‌మెంట్ ప్యాకెట్ల'ను అతిథులకు అందిస్తూంటే నిరంజన్ వచ్చాడు ఆమె దగ్గరకు.

"చూడండి! అతిథులుగా వచ్చి మీరిలా పనిలోనికి చొరబడ్డం నాకు బాగాలేదు. ఆ ట్రేను యిలా అందించి, మీరువెళ్ళి హాయిగా కూర్చోండి." అన్నాడు.

"పరవాలేదండీ! రజనియిల్లంటే అది మాయిల్లే. ఇక్కడ మాకు మర్యాదలేమిటి?'. అంది, సుజాత పల్చగానవ్వి!

నిరంజన్ తిరిగి ఏదో చెప్పబోయేలోగా రజని వచ్చింది.

"బాబ్జీ వచ్చాడు." అందివస్తూనే!

"అలాగా"! అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు, నిరంజన్.. అక్కడినుండి!

"బాబ్జీ ఎవరు ?" అడిగింది సుజాత.

"నా అన్నయ్య ఫ్రెండులే! రా ... పరిచయం చేస్తాను చాలా గమ్మత్తయిన వ్యక్తి" అంది రజని.

"వద్దులేవే ఊరికినే అడిగాను" అంటూ మొహమాట పడింది సుజాత.

"మరేం కొంపలు మునిగిపోవు గాని వెళ్దాంరా! ప్రతిదానికి మరీ అంత బెదురు పనికిరాదు" అంది సుజాత చేయి అందుకొని రజని!

"బెదురెవరికి ?" అంటూ వచ్చాడు నిరంజన్.

అతని వెనుకనే వచ్చిన విక్టర్‌ను చూసి ఆశ్చర్యపోయింది సుజాత.

"హల్లో మీరేనా ?" అంటూ విక్టర్ కూడా ఆశ్చర్యాన్ని ప్రకటిస్తే...

"ఈవిడ నీకెల్లా తెలుసోయ్!" అంటూ తను కూడా ఆశ్చర్యపోయాడు నిరంజన్!

"ఓసారి చెప్పాను కదూ ఆక్సిడెంట్ గురించి" అంటూ జ్ఞాపకం చేశాడు విక్టర్.

"అయితే ఆ వీరాధివీరుడివి నువ్వేనన్నమాట! మా సుజాత చెప్తే ఆ వ్యక్తివి నువ్వేనన్న అనుమానం కూడా రాలేదు సుమా!" అంది రజని.

విక్టర్ నిశ్శబ్దంగా నవ్వి ఊరుకున్నాడు.

అరుణని కూడా కేకేసిపిల్చి విక్టర్‌కు



పరిచయం చేసింది రజని.

"మా సుజాత ప్రాణాలు కాపాడి మళ్ళీ మాలో పడేశారు. చాలా చాలా ధన్యవాదాలు" అంది అరుణ నవ్వి.

'ఇంత ఆలస్యంగానా ధ న్య వా దా లు' నిరంజన్ నవ్వాడు.

"బెటర్ లేట్, దేన్ నెవ్వర్ అన్నారు. సంతోషించండి" అంది రజని.

"చాలా సంతోషం సరేనా ?" అని చుట్టూ చూసి "మనం నిలబడే మాట్లాడాలని నిబంధన లేకపోతే ఎ క్క డ యి నా కూర్చుంటే బావుంటుందను కుంటాను" అంటూ ప్రపోజ్ చేశాడు విక్టర్.

అతని సూచనకు అందరూ తమ ఆమోదాన్ని తెలియచేశారు.

నిరంజన్ మాత్రం "మీతో కూర్చొని కబుర్లు చెప్పడానికి నాకు తీరుబడిలేదు. మీరు మాట్లాడుతూ ఉండండి, నేను వెళ్ళి పని చూసుకుంటాను" అని వెళ్ళిపోయాడు.

"మీరంతా బి.యస్సీ. చదువుతున్నారను కుంటాను!" అన్నాడు విక్టర్... అందరూ కూర్చున్న తరువాత!

"ఔనండి నేను, రజని, అరుణ... ఒకే క్లాసు" అంది సుజాత!

"మీ గ్రూపేమిటి ?"

"జువాలజీ మెయిన్... బాటనీ, కెమిస్ట్రీలు సబ్సిడరీలు..." చెప్పింది అరుణ!

"జువాలజీ అంటే... కప్పలూ అవీ కోస్తారు అదేనా?" విక్టర్ చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"ఒక్క కప్పలేమిటి ? దొరకాలేగాని ... మనుషుల్నికూడా కోసిపారేస్తాం..." అంది రజని!

"మనుషుల్నికూడా కోసిపారేయడానికి వేరే వాళ్ళున్నారుగాని... నీకెందుకా శ్రమ" అని నవ్వి "అన్నిరకాల జంతువులను కోసి ఏం చేస్తారు ?" అని అడిగాడు విక్టర్!

"చూస్తాం. చూసి నేర్చుకుంటాం. నేర్చుకున్నది పరీక్షలలో వ్రాసి, క్లాసు తెచ్చుకొని ఎమ్మెస్సీలో చేరి..."

రజని మాటలకు మధ్యలోనే అడ్డు తగిలి అన్నాడు విక్టర్! "ఆ పైన రీసెర్చి చేసి ఓ డాక్టరేటు డిగ్రీని సంపాదించి, మెడలో వేసుకుని తిరుగుతారు. అదికాదు నేను అడి

పై వారమే

దీపావళి

'కథల పోటీ'

వివరాలు

గేది. మీరింత కష్టపడి నేర్చుకున్న విద్యతో సమాజాని కేవిధంగా సహాయపడగలరని ... నా సందేహం. ఎందుకంటే మీరు చదువు పూర్తి చేసుకున్న తరువాత ఏవరో పిలిచి ఉద్యోగం యిస్తే తప్ప... మీ చదువులు మీకు ఉపాధిని కల్పించవు. మీ విజ్ఞానాన్ని పెట్టుబడిగా పెట్టి స్వయం ఉపాధిని కల్పించుకోలేరు. ఒక్క మీరు చదువుతున్న సబ్జక్టనేకాదు. ప్రస్తుత కళాశాలల్లో చదువులతీరే అంత! ఏ డాక్టరో, ఇంజనీరో... లేక అటువంటి వృత్తి సంబంధమైన కోర్సులో తప్పించి చాలా వరకూ జీవితానికి పనికిరాని విజ్ఞానమే! కార్పెంటరీ, టేనరీ, డ్రైరీయింగ్, పౌల్ట్రీ, హార్టికల్చర్ మొదలైన వృత్తి విద్యలు ఎన్నో ఉన్నాయి. మీరు చదివే చదువులకంటే అవి మంచివేమో!"

"కావచ్చు. కానీ దానికి మేము ఎలా బాధ్యులం? మా కాలేజిలో లభ్యమయే కోర్సు చదవగలం కాని లేనిదాన్ని ఎలాచదువుతాం?" అంది, రజని!

"లభ్యమయే కోర్సుకూడా చదవలేరు." విక్టర్ అన్నాడు. "కొన్ని గ్రూపులకు రష్ ఎక్కువగా ఉంటుంది. కానీ అందరికి తగినన్ని సీట్లుండవు. కాబట్టి మిగిలినవాళ్ళు ఇష్టంలేకపోయినా. వేరే గ్రూపులు తీసు కుంటారు. ఆమధ్య మా స్నేహితుని తమ్ముడ్ని అడ్మిట్ చేయటానికని ఓ కాలేజికి వెళ్ళాను. ఆకుర్రాడికైతే మంచి మార్కులే వచ్చాయి గాని అతనికి కావలసిన గ్రూప్‌లో ఖాళీలులేవు. చివరకు వెతగ్గా వెతగ్గా అందరూ వదిలేసిన గ్రూప్‌లో ఖాళీ కనిపించింది అదే చాలనుకొని అందులోనే చేరిపోయాడతను. అంటే అభిరుచిలేని చదువన్నమాట! కొన్ని పనికివచ్చే గ్రూపుల్లో సీట్లను పరిమిత చేసి

# తమసోమా జ్యోతిర్గమయ

ఆ గ్రూపుకావాలని వచ్చిన అధిక సంఖ్యాకులను పనికిరాని మిగిలిన గ్రూపుల్లోకి బలవంతంగా తోలడం అన్యాయం. ఈనాటికు రాళ్ళు కూడా ఏదో ఒకటి చదవాలని ఎగబడ్డం మినహా దానివలన భవిష్యత్తులో లాభమేమిటని ఆలోచించరు..."

"దానికి కారణ మేమిటంటారు?" అడిగింది, అరుణ!

"భయం..." విక్టర్ నవ్వాడు...

"భయమా?"

"నా అభిప్రాయంలో, అంతే! డిగ్రీవస్తే ఏగుమస్తా ఉద్యోగమైనా రావచ్చుని ఆశ! గ్యారంటీగా వచ్చే ఆదాయంమీద ఆశే... మనిషిని, ఈదేశంలో కష్టపడి పనిచేయకుండా చేస్తున్నది. పనికిరాని కోర్సులు చదివే బదులు అభిరుచి వున్న గ్రూపులో సీటు లభ్యంకానపుడు... ఆడబ్బుతో... ఏదో చిన్న వ్యాపారం మొదలుపెట్టొచ్చు. కానీ .. భయం. 'రిస్క్' తీసుకోవడానికి అంగీకరించం మనం! మన దేశంలో లక్షలాది నిరుద్యోగులున్నారు. వాళ్ళలో నూటికి తొంభై తొమ్మిదిమంది. ఉద్యోగ ప్రయత్నం మినహా వేరే జీవనోపాధికి ప్రయత్నించరు. చిన్న చిన్నపనులు చేయడానికి నామోషి. కనీసం ఉద్యోగం దొరికేవరకైనా ఏదోవకటి చెయ్యొచ్చు. కానీ చెయ్యరు. అప్లికేషన్ ఫీజుదగ్గరనుండి ఇంటర్వ్యూకు వెళ్ళి రావడానికూడా ఇంటివాళ్ళే డబ్బివ్వాలి.

"మనవాళ్ళకు కష్టపడి పనిచేయడంలోని విలువ తెలిదు. విదేశాలలో చదువుకుంటూన్న రోజుల్లోనే హోటళ్ళలో సర్వర్లుగా కార్లు తుడిచే క్లీనర్లుగా, పేపర్ బాయిస్‌గా పనిచేసి డబ్బు సంపాదించుకుంటారు. అలా చేయడానికి వాళ్ళు సిగ్గుపడరు. ఒక వ్యక్తి స్వంతంగా సంపాదించుకో గలిగిననాడే అతనికి బాధ్యత తెలిసివచ్చేది. అప్పుడే... జీవితంలో ముందుకు పోగలమన్న ఆత్మ విశ్వాసం కలుగుతుంది. ఎదురుదెబ్బ తగిలితే తట్టుకొని నిలబడగల స్థైర్యం వస్తుంది. కానీ మన విధానమే వేరు. జీవితమంటే వడ్డించిన విస్తరిలా ఉండాలి. కష్టపడి బ్రతకాలంటేనే భయం" అన్నాడు విక్టర్!

శ్రోతలు ముగ్గురూ... నోళ్ళూ, కళ్ళూ పెద్దవిచేసి విన్నారు అతని మాటల్ని!

సుజాత అన్యమనస్కంగా ఉండటాన్ని గమనించి "అలా ఉన్నారేం? నా మాటలు బాగా బోరు కొట్టాయనుకుంటాను..." అన్నాడు.

"లేదండీ! మీ మాటలే ఆలోచిస్తున్నాను. కానీ దీనికంతకూ మూలం ఎక్కడుందని ఆలోచిస్తున్నాను.

"బాపూజీ... స్వాతంత్ర సమరంలో తను అడుగుపెట్టి. దేశానికి పిలుపుయిచ్చారు తను పొదుపు పాటించి మిగిలినవారిని పొదుపు చెయ్యమని చెప్పారు. తను మద్యపానానికి దూరంగా ఉండి, మద్యపానం మానమని సమాజాన్ని కోరారు. మార్గదర్శకత్వమంటే అది! అటువంటి మహోదాత్తమయిన నాయకులు అంటే తాము నమ్మినవి ముందు తామే ఆచరించి చూపే నిజమైన మార్గదర్శకులు... ఈనాడు కనిపించరు!

"కుల, మత తారతమ్యాలు పాటించ గాదనే నినాదం కట్టాలకు వ్యతిరేకంగా చేస్తున్న ప్రకటనలు. ఈ నినాదాలు, ప్రకటనలు చేసేవారు. వాటిని తమ నిత్య జీవితంలో అసలు జరుపుతున్నారా అని నా అనుమానం! ప్రగతి అనేది మాటలకే పరిమితమై మిగిలింది తప్ప ఆచరణలో కనిపించడంలేదు.

"దీపం వెలిగించి పట్టుకొని కళ్ళు మూసుకొని నడుస్తున్నట్లుంది మన పరిస్థితి! అందరూ చెప్పేవారేగాని చేసి చూపించేవారు కనిపించరు" అంది సుజాత నిట్టూర్చి!

విక్టర్ కుతూహలంగా చూశాడామెవైపు మెచ్చుకోలుగా!

"కొంపతీసి నీకూ ఓ పెద్ద ఉపన్యాస మివ్వాలనే వాంఛ కలగలేదు కదా" అంది రజని పరిహాసంగా.

"లేదులే కంగారుపడకు" అభయం పారేసింది సుజాత.

"బతికించావు లేకుంటే ఈ ఉపన్యాసాల ప్రవాహంలో పడి కొట్టుకుపోయే వాళ్ళం" రజని నవ్వింది.

సుజాత కూడా రజని నవ్వుతో శ్రుతి కలిపింది.

విక్టర్ ఆమెవైపు క్షణం, తనను తాను మరిచిపోయి తదేకంగా చూశాడు. అంతలో సభ్యత గుర్తువచ్చి చూపు మరల్చుకున్నాడు గాని తననో కంట సుజాత కూడా గమనిస్తున్నదని అతనికి తెలీదు.

తమ యిద్దరినీ రజని గమనించే విషయం వాళ్లలో ఏ ఒక్కరికీ తెలీదు.

*         *         *

నేలను కబళించాలని ఆత్రుతగా ఎగిసి వస్తున్న కెరటాలు ఒడ్డును తాకి విరిగిపడి తెల్లబోతున్నాయి.

రామకృష్ణ మిషన్ నుండి తెరలు, తెరలుగా వినిపిస్తున్న ప్రార్థనా గీతాలు, సముద్రపు హోరులో కలిసిపోతున్నాయి. చీనాబాదం కుర్రాళ్ల అరుపులతో, చిన్నపిల్లల కేరింతలతో క్షణ క్షణానికి వచ్చిచేరే జన సందోహంతో బీచ్ అంతా కోలాహలంగా ఉంది

స్నేహితురాళ్ళు ముగ్గురూ స్కాండలు పాయింటుకు కొంచెం దూరంగా కూర్చున్నారు ఇసుకలో.

రజని ఏదో మాట్లాడుతూ ఒక్కసారి సుజాత వైపు చూసింది. పరధ్యానంగా సముద్రం వైపే చూస్తున్న సుజాత రజని చూపుల్ని గమనించలేదు.

"నిన్నే" అంటూ రజని హెచ్చరించడంతో ఉలికిపడి ఏమిటన్నట్లు చూసింది.

"ఏమిటా ఆలోచన?" అడిగింది రజని.

"ఆలోచనకాదు. చూస్తున్నాను. ఆ సముద్రాన్ని చూడు. అంతా నీరే కదూ" అంది సుజాత.

"గొప్ప డిస్కవరీ! వాస్కోడి గామా ఆఫ్ విశాఖ సముద్రం అంటూ నీకో బిరుదు పారేయాలి తప్పదు" అంది అరుణ నవ్వుతూ.

సుజాత, అరుణ మాటలను లక్ష్య పెట్టలేదు.

"అంతా నీలమే! అనంతంగా ఎలా పరచుకొని ఉందో చూడు" అంది తన్మయంగా!

"ఫరవాలేదే! అమ్మాయిగారికి కవిత్వం వస్తున్నాది" అరుణ మళ్ళీ నవ్వింది.

"కోయిల కూసేది వసంత కాలంలోనే" అని "కంగారుపడకు. కవిత్వం చెప్పబోవడం లేదులే" అంది రజని!

"నీ గురించి నాకా అపోహలేదు. కవిత్వం చెప్పాలంటే రసానుభూతి కావాలి" అంది అరుణ!

"ఆ రసానుభూతులేమిటో నీకే తెలియాలి" అని గుంభనంగా నవ్వి ... "ఏమంటావ్!" అంది సుజాతతో రజని!

"నీ వాగుడికి దాని సపోర్టు కూడా కావాలా?" చిరాగ్గా అంది అరుణ!

"సపోర్టు లేనిదే బతుకే లేదే అమ్మడూ" సపోర్టులు సక్రమంగా లేకపోతే ఆశాసౌధాలన్నీ కూలి నేలపాలవుతాయి. తస్మాత్ జాగ్రత!" అంది రజని తర్జని చూపించి.

తనలా ఊరుకుంటే రజని యింకా ముందుకుపోయే ప్రమాదముందని టాపిక్ మార్చడానికి నిశ్చయించుకుంది సుజాత!

"పరీక్షలు దగ్గరకొస్తున్నాయి" అంది నాందిగా!

"మనం ఊరుకుంటే అడ్డమైనవన్నీ దగ్గరకే వస్తాయి. కమ్మీ పుచ్చుకు వెంటబడితేసరి... గప్...చిప్.." అంది రజని!

"అర్థం లేకుండా వాగకు ఇడియట్..." అని కసిరి "రికార్డు పని యింకా పూర్తి కానేలేదు" అంది సుజాత!

అరుణ నిర్లక్ష్యంగా నవ్వి ... "అదే ఔతుంది" అంది!

"నీకైతే రికార్డు వేసిపెట్టేందుకు ... జంటలున్నారు. మాకెవరున్నారమ్మా ..." అంది రజని!

సుజాత, రజనివైపు కోపంగా చూసింది.

రజని బుద్ధిగా లెంపలు చేసుకుని "పొరపాటే దాన్నొక్కదాన్నే ఏడిపించడం" అంటూ కిసుక్కున నవ్వింది.

"ఛీ.ఛీ. నీతోమాట్లాడ్డమేపొరపాటు.." విసుక్కుంది సుజాత...

"రికార్డుపని ఎలా పూర్తి అవుతుందా అని నేను భయపడి చస్తూంటే మధ్యన నీ గోలేమిటి?"

"నీ కన్నీ భయమే" రజని అంది. "చదవడానికి భయం, తింటానికి భయం, మాట్లాడ్డానికి, చివరకు ప్రేమించానని చెప్పుకోవడానికీ భయమే! ఇంత భయస్తురాలిని లైఫ్‌లో ఎలా నెట్టుకొస్తావో అర్థం కావడంలేదు.."

"అదేదో చదువు గురించి మాట్లాడుతూంటే నువ్వింకేదో వాగుతున్నావ్!" అరుణ కోపంగా అంది.

రజని నవ్వి, అంది:" అలా అగ్గీ బుగ్గీ అయిపోకు చిట్టీ! సీరియస్ టాపిక్స్‌ను మనమెంత తేలిగ్గా తీసుకుంటే ... మనసుకు అంత రిలీఫ్. కాస్త జోక్ చేశానంతే! బొత్తిగా మీకు సెన్సాఫ్ హ్యూమర్ లేకపోతే... ఎలా చచ్చేది, మీతో!"

"నువ్విలా మాట్లాడబట్టే ... ప్రాణం హాయిగా ఉంది. నీ చిలిపి తనమే లేకపోతే... జీవితం మరీ చప్పగా అయిపోయేది...ఏనాడో" అంది, సుజాత పల్చగా నవ్వి!

"స్టాప్‌దేర్! అట్టే పొగిడావంటే... అప్పడాలపిండిలా ఊరిపోతాను. ఈ స్క్రషనో సంగతికేంగాని ... చీకటి పడబోతూంది. ఇకలేద్దామా?" అంటూనే లేచినిలబడింది, రజని!

"అప్పుడే..." అంటూ... తనూలేచింది అరుణ!

సుజాతకూడా లేచి.."ఇక పోదాం. వేగిరమే యిల్లు చేరాలి. మా అమ్మకు అసలే కంగారు..." అంది

(49వ పేజీ చూడండి)



చల్లనిసాయంసంధ్య. పిల్లగాలుల్లో తేలితున్నాయి తెల్లని మబ్బులు. పోతూ పోతూ చల్లని నీటితుంపరలు జల్లుతున్నాయి. కలకలారావంతో పక్షులు గుంపులు గుంపులుగా ఎగిరిపోతున్నాయి, గూళ్ళు చేరుకోవడానికి తొందర పడుతూన్నట్టుగా. ఈ చల్లనిగాలి, చక్కని దృశ్యం, ఏదీ గంగ దృష్టికి తగల లేదు. ఆమె మనసు ఆరాటంతో, అసహనంతో, అసహ్యంతో ఉడికిపోతోంది.

చేతిలోని ఉత్తరం ఆమెని చూసి వెక్కిరిస్తూన్నట్టు గాలికి రెపరెపలాడుతోంది.

గంగ మ్యూజిక్ కాలేజీలో టీచరు. కోల మొహం, పోగకళ్ళు, సొట్టలుపడే బుగ్గలు, అందమైన పలువరస, ఎవరినైనా చిటికెలో ఆకర్షించే రూపం ఆమెది. ఎప్పుడూ నవ్వుతూ, అందర్నీ నవ్వించే గంగకళ్ళు పాతాళగంగలా ప్రవహించాయి, ఆ రోజు. మళ్ళీ మళ్ళీ చదివింది ఉత్తరాన్ని. "అడిగిన వెంటనే విడాకులకి సమ్మతిస్తూ కాగితాలు పంపుతావనుకోలేదు. నీకేం? ఇదివరకెందరయ్యారో? ఇకముందు ఎందరో? సరే! కోర్టువారి సమ్మతికూడా త్వరలోనే రావచ్చు. దాంతో నీకు నాకూ లాప్రకారం కూడా తలాఖ్... తలాఖ్... తలాఖ్... అంటే తెలుసుగా... ముస్లింలు, మూడుసార్లు 'తలాఖ్' అంటే చాలుట వేరే కోర్టుకెళ్ళి విడాకులు పుచ్చుకో అక్కర్లేదట. ఎంతహాయి! కోర్టుఖర్చు వుండదు. గుడ్...బై..."
ఉత్తరాన్ని మడిచి కవరులో పెట్టేసింది.

గదిలో దీపం వెలిగింది. ఉలిక్కిపడింది గంగ. "ఏం మరదలా! మళ్ళీ ఉత్తరమేమైనా వచ్చిందా? పరధ్యానంగా వున్నావు?" అంది నవ్వుతూ ఒదిన సుజాత, దిగాలుగా కూర్చున్న గంగకేసి చూసి.

"ఊఁ..."

"ఇంకా ఏమంటాడు?" కోపంగా అంది ఆమె. ఆమెకి అతనంటే మొదటనుంచీ మంట. ఎందుకనో అతణ్ణి చూసిన క్షణంలోనే అంది "గంగా, ఇతనుట్టి నంగనాచిలా ఉన్నాడే. ఎలా వేగుతావో ఏమోనని!"

"ఫో వొదినా! నువ్వు మరీను. మొహంలో రాసుందేమిటి? చదివినట్టు చెప్తున్నావ్!" చిరుకోపంతో అంది గంగ.

"ఏమో! అతన్ని చూస్తే అలా అనిపించింది నాకు. ఏమీ అనుకోకు" క్షమాపణ చెప్పకుంది.

గంగ, వొదిన సుజాత, సరదాగా మాట్లాడుతుంది. ఏదైనా ఉంటే ఉన్నదున్నట్టు మొహాన చెప్పేస్తుంది. అనవసరంగా ఎవ్వర్నీ నొప్పించదు. అటువంటిది రామచంద్రను తొలిసారిగా పరిచయం చేసినప్పుడే ఇలా అంది గంగతో.




గంగ గలగలా నవ్వేసి ఊరుకుంది ఆ రోజున.

"ఏదీ ఉత్తరం ఇలా ఇవ్వు నేనే చదువుతాను" అంటూ కవరు చేతిలోంచి అందుకుని చదవడం మొదలుపెట్టింది.

"హూఁ... ఈ మగవాళ్ళకి ఎంత అహంకారం? ఓటమిలో కూడా వారిదే పైచెయ్యి అని చంకలు కొట్టుకుంటారు. ఆడదంటే ఆటబొమ్మ లనుకునేవాళ్ళు ఈ రోజుల్లోనూ ఉన్నారంటే ఆశ్చర్యం అనిపిస్తుంది" సుజాత మొహం కోపంతో ఎర్రబడింది "తలాఖ్... తలాఖ్... అని మూడుసార్లంటే చాలుట. మూడు ముళ్ళ బంధం మూడు నిముషాల్లో తెగిపోతుందిట. కలియని మనస్సులకీ, కలతల బ్రతుకులకి, మూడుసార్లెందుకు? ఒకసారంటే పోలా? వివాహ బంధం ఎన్ని జన్మల సంబంధమో, హృదయంలేని బండరాయికేం తెలుస్తుంది? పోనీలే... పీడ విరగడై పోయింది. ఈనాటినుండి, నీ యిష్టం వచ్చినట్టు నువ్వుండొచ్చు. నిన్నుగా ఆరాధించే వాడికే నువ్వు అంకితం కావాలి కానీ ఇటువంటి కసాయివాడికి కాదు" ఆవేశంతో ఊగిపోతోంది సుజాత.

"సుజీ" అంటూ అన్నయ్యకేక వినపడక పోతే, సుజాత వాక్ప్రవాహం ఆగి ఉండేది కాదు.

"వొస్తున్నా" అంటూ, సుజాత వెళ్ళిపోగానే, మళ్ళీ గతంలోకి జారిపోయింది గంగ.

* * *

ఆరోజున రవీంద్ర భారతిలో 'తెలుగు గాయనీ గాయకుల సమితి' వారు సమర్పించిన, లలిత సంగీత కార్యక్రమంలో, రెండు పాటలు పాడింది తను. ఎంతో శ్రద్ధగా విన్నారు అందరూ. 'సుశీల'లా పాడింది అన్నారు కొందరు. "భానుమతిలా చక్కగా ఆలాపన చెయ్యగలదు" అన్నారు కొందరు. "ఏది ఏమైతేనేం? చక్కని కంఠం, సాహిత్యాన్ని

అర్థంచేసుకుని శ్రావ్యంగా పాడుతుంది'' అన్నారు మరికొందరు. రామచంద్ర అనే అబ్బాయి కూడా పాడాడు. అతను తెలుగు గాయనీ గాయకుల సమితి మెంబరే. కార్యక్రమం అయిపోయాక, అందరి అభినందనలు అందుకుని సెలవు పుచ్చుకుంది తను. కానీ, రామచంద్ర మాత్రం జిడ్డులా పట్టుకున్నాడు. ఇంటిదాకా వొచ్చాడు. ''మీ గానం గంధర్వగానాన్ని మరిపిస్తుంది. కోకిలకే ఆశ్చర్యం కలుగుతుంది. మీ కంఠంలోని మాధుర్యానికి'' అంటూ ఏవేవో పొగడ్తలతో ముంచేశాడు. ఇంటిదాకా ఒచ్చాడు కదా అని సభ్యతకోసం లోపలికి రమ్మంది తను. ఒదినకి పరిచయం చేసింది.

కాస్సేపు కూర్చుని మళ్ళా వస్తానంటూ వెళ్ళిపోయాడు. వదిన కూడా ఏదో పన్లో వుండటంవల్ల సరిగా చూళ్ళేదతన్ని.

ఆ తరువాత, ప్రతీరోజూ, కాలేజీకెళ్ళే తోవలో కనిపించేవాడు. కాలేజీ దాకా కబుర్లు చెబుతూ నడిచేవాడు. ఇలా కొద్దిరోజులు జరిగేసరికి, తనకి తెలీకుండానే, కాలేజీకి వెళ్ళేటప్పుడు అతనికోసం వెతికేది తను. ఏ రోజైనా అతను కనిపించకపోతే, ఏదో లోటుగా అనిపించేది ఆ రోజంతా. ఆ తరువాత ఇద్దరూ కలిసి ఎన్నో కార్యక్రమాల్లో పాల్గొన్నారు. కలిసి 'డ్యూయెట్లు' పాడారు. అలా పాడుతూవుంటే, ఏదో అనుభూతి ... కమ్మని పులకరింత ... మనస్సు తేలిపోయేది. ఆ తన్మయత్వం, మైకంలా కమ్ముకుపోయేది. అతను అందగాడు కాదు. ఐశ్వర్యవంతుడూ కాదు కానీ, హృదయాలను స్పందించగలడు. గళం అతని సొత్తు. గానం అతని భాగ్యం. ఒకరోజున ఎక్కడో ప్రోగ్రాంకి వెళ్ళి, తిరిగొస్తున్నారు. ఇద్దరూ మౌనంగానే నడుస్తున్నారు. ఉన్నట్టుండి అతను ''గంగా మన రాగాలకి, అనురాగం తోడైతే ఎలా వుంటుందంటావ్?'' అన్నాడు ''అంటే?'' అంది తను అయోమయంగా ''సంగీతానికి పెళ్ళి. మన సంగీతానికి, అనురాగాన్ని జోడించి, తాడుతో మూడు ముళ్ళు వేసి గట్టిగా బంధించేస్తే?'' పకపకనవ్వింది తను ''ఎందుకలా నవ్వుతావ్?'' అమాయకంగా అడిగాడు.

''పెళ్ళి మన సంగీతానికేకానీ, మనకి కాదన్నమాట'' నవ్వుతూనే సమాధానం చెప్పింది. అతనూ నవ్వేశాడు, ఆనాటి నుంచి వీరి దృష్టి పెళ్ళివైపు మళ్ళింది. అమాటే చెప్పింది.

''చూడు గంగా. అమ్మా నాన్నా లేక లేకపోయినా ఆ లోటు తెలీకుండా పెంచాను నిన్ను. నిన్ను ఆడబిడ్డగా కాక, నా కన్న బిడ్డగా చూసుకున్నానమ్మా. బిడ్డలు లేని లోపం నీవల్ల తీరింది నాకు. నీ కోరిక నెప్పుడూ, ఏదీ కాదనలేదు నేను. కానీ, ఈ విషయంలో, నీకు మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యాలని ఎన్నో ఆశలు పెట్టుకున్నారు మీ అన్నయ్య.

''మనసులు కలిసిన కోరుకున్న మనువు కన్నా మంచి సంబంధం వేరే ఏముంది ఒదినా. రామచంద్ర బీదవాడే కావొచ్చు. అందగాడు కాకపోవచ్చు. కానీ ప్రేమించే హృదయం వుంది. నేనంటే ఆరాధన వుంది. అన్నింటినీ మించి, నా పాటంటే చెవి కోసుకుంటాడు. పైగా అతనూ గాయకుడే. సంగీతమే మా ఆస్తి: కళారాధన, నాపై ప్రేమ, ఇంతకన్నా నే కోరుకునేది ఏదీ లేదొదినా. ఎలాగైనా అన్నయ్యని మా పెళ్ళికొప్పించు'' నిశ్చలంగా, స్పష్టంగా చెబుతూన్న గంగ మాటలు, సుజాతని తృప్తిపరచాయి. ''సరేనమ్మా. తప్పకుండా ఒప్పిస్తాను. కానీ, ఒక్కసారి, అతన్ని నాకు పరిచయంచెయ్యి. ఆ రోజు సరిగ్గా చూడలేదు'' అంది.

''అలాగే వొదినా. సాయంకాలం 'టీ'కి పిలుస్తాను'' అంది సంతోషం కళ్ళల్లో మెరిసిపోతూవుంటే, ఉత్సాహంగా గంగ.

* * *

ఒకప్లేటులో బిస్కట్లు, మరోప్లేట్లో మిక్సరూ పెట్టి కాఫీకప్పులతో ఒచ్చింది సుజాత. రామచంద్రని పరిచయం చేసింది గంగ. కాఫీకప్పు అతనిచేతికిచ్చి, ఎదురుగుండా వున్న కుర్చీలో కూర్చుంది సుజాత.

సాధారణంగా సుజాత కొత్తపాత అనే భేదంలేకుండా గలగలా మాట్లాడేస్తుంది. అటువంటిది రామచంద్రతో మాట్లాడాలంటే సంభాషణే సాగడంలేదు. ఏదడిగినా ముక్తసరిగా సమాధానం చెప్పి, దిక్కులు చూసే అతనితో, మాట్లాడాలనిపించలేదు, సుజాతకి. ఏదో పనున్నట్టు లోపలికి వెళ్ళిపోయింది. కాసేపు కూర్చుని వెళ్ళిపోయాడు రామచంద్ర. వొదిన అభిప్రాయం కోసం ఆమె దగ్గిరికి వెళ్ళినతను ఆమె అన్నమాటలకి కోపం తెచ్చుకుందికూడా ''ఉత్త వంగనాభిలా వున్నాడే, ఎలా వేగుతావో ఏమో! మనసువిప్పి మాట్లాడే రకంకాదు. సరేలే. ఇంతకీ చేసుకునేది నువ్వు. నీకు ఇష్టమయితే నాఅభ్యంతరం ఏముంది? మీ అన్నయ్యతో చెబుతాను''అంది ఆమె చివరి మాటలువచ్చాయి తనకి అందుకే కోపాన్నంతా దిగమింగి చిరునవ్వు నవ్వేసింది.

* * *

సగోత్రం అని, శాఖాభేదమని కొందరు ఎన్ని అడ్డంకులు పెట్టినా, అన్నిటికీ ఏదో ఒక అమెండుమెంటు మార్గం చూపిస్తూనే వచ్చాడు పురోహితుడు. పురోహితుని సలహా ప్రకారం, అన్నిపాటించి, ముహూర్తాలు పెట్టుకున్నారు. గంగ రామచంద్రకు భార్య అయింది. ప్రతి కన్నెపిల్లా ఎదురుచూసే తొలిరేయి కొందరికి కమ్మని కలలపంట అయితే, మరికొందరికి మరుపురాని ఆరని మంట అవుతుంది. ఆ రాత్రి సంభాషణ తలుచుకుంటే ఒళ్ళుమండిపోతుంది. నరాలు ఉడికి పోతయ్. ''గంగా! ఎంత అందంగావున్నావో తెలుసా?'' నవ్వింది తను.

''ఎలా తెలుసు? ఎవరైనా చెప్పారా నీకు?''

''అవును'' అంది వోరచూపుతో అతన్ని పరికిస్తూ తను.

''ఎవరు చెప్పారు? ఒక ఆడది మరో ఆడదాన్ని అందగత్తెవని, ఛస్తే పొగడదు. నీకు బాయ్ ఫ్రెండ్స్ వున్నారా?'' అతని కంఠంలోని అనుమానం, కత్తిపోటులా గుండెల్ని కోసేసింది. అసహ్యంతో నరాలు పొంగాయి. ''అవును వున్నారు. వాళ్ళే చెప్పారు నేను అందంగా వుంటానని'' అందామనుకుంది. కానీ, మూరెళ్ళ వైవాహిక జీవితం, ఒక్క రేయిలోనే తెగిపోకూడదని, తన్ని తాను సంభాళించుకుంది. లేని నవ్వు పెదాలమీదికి తెచ్చుకుంటూ, ''అద్దంలో నా ప్రతిబింబం, ప్రతినిత్యం చెబుతూనే వుంటుంది'' అంది. సమాధానంగా ఒక

త్వరలో

''మాయాజాలం

మతికట్టు''

వె తినవు నవ్వాడు. గదిలో అడుగుపెట్టే ముందున్న పాలపొంగులాంటి కోరిక, క్షణంలో చల్లారిపోయింది తనకి. కానీ, అతనికి తన మీద వుండే హక్కును కాదనలేక, లొంగిపోయింది. ఆ రోజు మొదలు, ఆడవాళ్ళు ఎక్కువగా తిరగకూడదని, తిరిగి చెడిపోతారనీ, నలుగురి మధ్యా నవ్వకూడదనీ, తనకిష్టంలేని చోట పాడకూడదనీ, రోజుకో ఉపన్యాసం ఇచ్చేవాడు రామచంద్ర. ప్రతిరాత్రి కాశీ మజిలీ కథల్లా, ఒక్కొక్క ఉపన్యాసమూ వింటూ, తనని తాను అర్పించుకుంటూ, నెల్రోజులు గడిపింది. మధ్యలో రెండు మూడు సార్లు ఇంటికెళ్ళింది గంగ. ఆవలిస్తే పేగులు లెక్కపెడుతుంది వొదిన. "ఏమిటిలా అయిపోయావ్? సంగీతం తప్ప భోజనం పెట్టడం లేదేమిటి మీ ఆయన" అంటూ అడిగింది. వొదిన ముందు తేలిపోవడం ఇష్టంలేక, నవ్వి ఊరుకుంది తను.

ఆ రోజు ఇంటికెళ్ళేసరికి, కాలేజీ ప్రిన్సిపాలు కమలాకరంగారొచ్చారు. అలా ఎటో పోతూపోతూ, తనుందేమో చూసి పోదామని. అతనికూడా, మరొకతనూ వున్నారు వొదిన అందరికీ కాఫీలిచ్చింది అతన్ని మాకందరికీ పరిచయం చేశారు. "మీరు చాలా బాగా పాడ్తారు. ఏదైనా కీర్తన పాడండి మీ పాట విని చాలా రోజు లయింది." అన్నారా కొత్తాయన.

"ఏది పాడను మాస్టారూ" అంటూ కమలాకరంగారిని అడిగింది తను.

"నీ ఇష్టం" అన్నారాయన.

"మీరు చెప్పండి"

"పరాన్ముఖ మేలనమ్మ...పాడు" అన్నారాయన.

"అదొద్దు.....రామనన్ను బ్రోవరాపాడు" అన్నాడు, రామచంద్ర. కాస్సేపు ఆలోచించి. మాస్టారుగారు చెప్పిందే పాడిందితను.

"చాలా బాగాపాడావు" అన్నారాయన. "కాలేజీకిరామ్మా మళ్ళీ" అంటూ కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయారు.

కాస్సేపయ్యాక మేమూ వెళ్ళిపోయాం. దోవలో అంతా ముభావంగానే వున్నారాయన. రాత్రి భోజనాలయ్యాక మామూలుగా, ఉపన్యాసం మొదలెట్టారు. "నేను చెప్పింది పాడక, వాడుచెప్పింది పాడేవేం? నన్నుఇన్సల్టు చెయ్యాలనా" కటువుగా వుంది కంఠం. "అదేమిటండీ. చిన్నప్పటినుంచి నాకుపాటాలు

## పగిలిపోయిన రికార్డు

చెప్పారాయన. అతను చనువుగా పాడమన్నది పాడితే తప్పా?" నాలోని రక్తం కోపంతో ఉడికి పోతూవుంటే తిరిగి ప్రశ్నించాను. "పాటాలు చెప్పేటంత మాత్రాన అంత చనువు రావాలా? ఏంత చనువేమిటి?" ఈసారి. నాకు ఒళ్ళు మండిపోయింది. "ఉండవలసినంత చనువుంది సరేనా?" అన్నాను "అయితే అతని తోటే సంసారం చెయ్యకపోయావా?" చెంప ఛెళ్ళుమంది పుట్టినప్పటినుంచీ ఎవ్వరిచేతా ఒక్కదెబ్బతిన్నలేదు తను తల్లీ తండ్రీ లేని లోటు తెలీకుండా పువ్వుల్లో పెట్టి, పెంచారు అన్నావొదినా. ఈనాడు, చెంపదెబ్బ పడేసరికి, దుఃఖం పొంగు కొచ్చింది. అంతటిలో ఊరుకోకుండా, తను కలసిపాడిన ప్రతి వారితోటి అక్రమ సంబంధాన్ని అంటగట్టి, నీచంగా మాట్లాడారు. ఆరోజు అతని ప్రవర్తనకి,




అక్కడినుంచి వెంటనే పారిపోవాలనిపించింది మెళ్ళోని మంగళసూత్రం తనని, గొడ్డులా కట్టేసినట్టనిపించింది. పశువులాంటి అతని ప్రవర్తనమీద, పరమరోతపుట్టింది. ఎంత ఏడ్చినా, ఎంత అసహ్యించుకున్నా, ఏమీచెయ్యలేని అశక్తురాలిలా తిరిగి అతనికి లొంగిపోయింది.

* * *

ఆ ఇంట్లో, అత్తగారికీ మామగారికీ అరక్షణం పడదు. తల్లికీ కొడుకుకీ, ఉప్పు నిప్పు తంతు. ఆస్తిపాస్తులు లేకపోయినా, కడుపునిండా తిండికూడా లేదు. పోనీ ఆదరణా, అభిమానం వున్నాయాఅంటే, అదీ లేక అంతా అనుమానపు మయం. వావీ వరుసాలేకుండా, ప్రతీవారినీ అనుమానించడం వాళ్ళ కలవాటు.

క్యాలెండర్లో మరో పేజీ తిరిగింది. ప్రతీ ప్రోగ్రాముకీ రామచంద్ర ఒక్కడే వెళ్ళొస్తున్నాడు "మీ ఆవిడ రావడంలేదేం?" అనో, "ఆవిడ చాలా బాగా పాడుతుంది అనో" ఎవరైనా అంటే చాలు, అతనికీ వాకు సంబంధం వున్నట్టే లెక్క ఆయన దృష్టిలో. ఇంటికొచ్చి తప్పు ఒప్పుకోమని చావగొట్టేవారు. తనుమాత్రం ఆడపిల్లల మధ్య తిరిగితే తప్పులేదుట. "చెయ్యని పాపాన్ని ఛస్తే ఒప్పుకోను" అని తిరగబడితే, ఆ రోజు మరీ బాగా శుద్ధి జరిగేది. మనసుకి శాంతిలేదు. కడుపుకి మంచి భోజనం లేదు.

పైగా వాంతులు కూడా అవుతున్నాయేమో, ఆ దెబ్బలు మరి భరించలేక, ఆడపులిలా ఎదురు తిరిగింది తను. అందుకు "నువ్వు ఆడదానివేనా? మహమ్మారిలా తిరగబడుతున్నావ్. మగవాడేదో, లక్ష అంటాడు అంత మాత్రంచేత వీధికెక్కడమే" అంటూ బుగ్గలు నొక్కుకుంది అత్తగారు.

పుట్టినప్పటినుంచీ కన్నీరంటే ఏమిటో తెలీని తనకి, తాళికట్టించుకున్న నాటినుంచీ, కన్నీళ్ళే తోడయ్యాయి. పెళ్ళి కాకముందు, గిరగిరా చుట్టూ తిరిగి, ప్రేమిస్తున్నామా, ఆరాధిస్తున్నాను అంటూ ఏవేవో తియ్యని కబుర్లు చెప్పిన ఈయన, పెళ్ళికాగానే, ఎందుకిలా మారిపోయారో, అర్థంకాక, సతమతమయిపోయింది తను. ఆ మాటే, తన స్నేహితురాలు ప్రమీలతో అంటే, 'కొందరు మగవాళ్ళంతేనే. అనుమానపు మనుష్యులు. భార్యగా లైసెన్సురాగానే, హక్కును వినియోగించుకుంటున్నామనుకుంటూ, చిత్రవధ చేస్తారు. చదువుని, సంస్కారాన్ని అంతా మరిచిపోయి, పెళ్ళామంటే వండిపెట్టే దాసిగా, పడకటింటి జోడుగా మాత్రమే, వాడుకుంటారు. ఆమె ఒక మనిషేననీ, ఆమెకి ఒక వ్యక్తిత్వం వుంటుందనీ అనుకోరు.'' అంది.

దాని మాటలు అక్షరాలానిజమనిపించాయ్. మరికొన్ని రోజులకే. ఇక భరించలేక, పంజరంలోనుంచి బయట పడింది తను. కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని, ఇల్లుచేరిన తననిచూసి వెక్కి వెక్కి ఏడ్చింది ఒదిన. మంచి మందులు ఇప్పించాలని, డాక్టరు దగ్గిరికి తీసికెళ్ళింది. ఊడిపోయే ముక్కు పట్టుకుంటే ఆగుతుందా అని, అసలే ఊపిరిలేని తనలోంచి సగంఊపిరిని పంచుకోవడానికి ఇష్టపడనట్టు పుట్టబోయే, పసికందు పుట్టకుండానే అంతర్ధానమయింది. 'అబార్షన్ అయిందని తెలిసి' మండి పడ్డా

# చూడండి
# మామూలు పంపు నీటినుండి
# కల్మషములను ఫిల్టరుచేసి
# ప్యూరిటాన్ దానిని త్రాగుటకు ఎలా
# 100% సురక్షితము చేస్తుందో.

కలరా, టైఫాయిడ్, రక్తవిరేచనములు,
గాస్ట్రో-ఎంటెరైటిస్ మొదలైన నీటి ద్వారా సంక్రమించే
జబ్బులు రాకుండా ఇంతకంటె మరో మంచి హామీ లేదు.



1. పై గదిలో పంపు నీరు పోయాలి.

2. లాబొరేటరీలో పరీక్షించబడిన కాండిల్ నీటిలోని సూక్ష్మజీవులన్నిటినీ ఫిల్టర్ చేస్తుంది.

3. అతుకు లేని, రసాయనిక-నిరోధమైన గీతలు పడని, ఇపోక్సీ-పూత వేసిన అల్యూమినియమ్ గది.

4. త్రాగటానికి తయారుగా ఉన్న 100% స్వచ్ఛమైన నీరు క్రింది గదిలో జమ అవుతుంది.



ప్యూరిటాన్ తేలికైనది, పగులనిది. ఒక చోట నుండి మరొక చోటికి తీసుకు పోవటానికి అనుకూలమై, శుభ్రపరచుటకు వీలైనది.



## నేడే ఒక ప్యూరిటాన్ తీసుకోండి. మీకు ఆప్తులైన వారి కోసం వాడదగినది.

హెచ్చరిక:
మీరు అసలైన ప్యూరిటాన్ ఫిల్టర్స్ మాత్రమే లభింప చేసుకుంటున్నారన్నది నిర్ధారణ చేసుకోండి. పై గదిపైగల ప్యూరిటాన్ లేబుల్ ఉందో లేదో చూడండి. కాండిల్ యొక్క మెటల్ బేస్‌పై ప్యూరిటాన్ పేరు, రిజిస్ట్రేషన్ నంబర్ **196501** కోసం చూడండి.

**బల్సారా**
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

**BALSARA** బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
43, నగీనదాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

Chaitra-BLC-19 Tel Rev.

## పగిలిపోయిన రికార్డు

రాయం. నేనే చేయించేసుకున్నానని. అతని పతిరూపం నాలో పెరగడం నాకిష్టంలేదనీ, అందుకే నేనూ, మావొదినా కలిసి ఈపని చేశామనీ ఏవేవో అన్నారు అన్నీ దింగమింగాను. ఏతల్లి మాత్రం గర్భశోకాన్ని కోరుకుంటుంది? గోరుచుట్టు మీద రోకటి పోటులా, నానాటికీ అతని దుర్భాషలు భరించరానివిగా తయారయ్యాయి. ఆరోజు అతనంటున్న నానా మాటలూ వొదినవినడం జరిగింది. "గంగా... ఇటువంటి జీవితం ఎలాగడ్పుతున్నావమ్మా అని వొదిన కన్నీరు పెట్టుకుంటూ పలకరించేసరికి గుండెల్లో దాగివున్న కన్నీళ్లు ఉప్పెనలా పొంగుకొచ్చాయి. పసి పిల్లలా ఏడ్చింది తను, వొదిన ఒళ్లో తల పెట్టుకుని. ఆ తరవాత కొన్నాళ్ళు ఆయన కనించలేదు. కొంచెం కొంచెం తేరుకుంది తను.

ఒకరోజున పోస్టులో 'డైవర్స్' కాగితాలొచ్చాయి. విడాకులకి సంతకం పెట్టమంటూ ఒక చిన్న ఉత్తరం కూడావుంది.

అది చూసిన వొదిన మండిపోయింది. "అటువంటి బుద్ధిహీనుడితో సంసారం చెయ్యడం తెలివితక్కువతనం అంది. మరేం ఫరవాలేదు. నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలిగే తెలివితేటలు నీకున్నాయి. నిన్ను నిన్నుగా గౌరవించగలిగిన వాడికిచ్చి మళ్ళీ పెళ్లి చేస్తాను. ఆడదంటే ఆడుకునే బొమ్మ కాదనీ, ఆమెకీ ఇష్టాయిష్టాలు, అభిరుచులూ వుంటాయని, బుద్ధి చెబుతాను. ఒక్క మగవాడేకాదు, ఆడదీ ఇష్టంలేని కాపురం చేస్తూ పడివుండే అవసరం నేటి మగువకి లేదని నిరూపిస్తాను. సంతకం పెట్టు" అంటూ కాగితాలమీద సంతకం పెట్టించింది. సంగీతానికి జరిగిన పెళ్లి, పగిలిపోయిన రికార్డులా, తెగిపోయింది.

సుజాత రావడంతో, ఉలిక్కిపడి చూసింది, పరధ్యానంగా కూర్చున్న గంగ. చేతిలోని ఉత్తరం, ఫాను గాలికి ఎగిరిపోయింది వరండాలోకి. వానచినుకులకి అక్షరాలు చెరిగిపోయాయి, తెల్లకాగితం మాత్రం మిగిలిపోయింది. కొత్త రాతలు, రాసుకోవడానికన్నట్టు. గంగ మనసు తేలికపడింది. మబ్బులు, విడిపోయి నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్నాయి. ఆకాశం ఎంతో అందంగా కనిపించింది.

ధర్మపథం

# చెడ్డ అలవాట్లు ఎలా పోతాయి?

చెడ్డ అలవాట్లు ఉన్నప్పుడు వాటిని మంచి మాటల మూలంగానే క్రమక్రమంగా తగ్గించి చివరకు మాన్పించవచ్చును విపరీత స్థితిలో ఆ దురలవాటును ప్రోత్సహించినా, ఆ వ్యక్తి తిరిగి ఆ అలవాటుకు సిద్ధపడడు.

ఒకనికి తన గురువు పైని ప్రగాఢమైన భక్తి విశ్వాసాలు ఉన్నవి. కాని అతనికి విడతెగక సిగరెట్లు తాగే దురలవాటు ఉన్నది. గురువుగారు ఒకసారి హెచ్చరించారు. కాని. వాటిని మానడం సాధ్యపడలేదన్నాడు. "సరే: నీవు సిగరెట్లు తాగవచ్చు. ఒక పద్ధతిని చెప్తాను. ఆ రీతిగా వాటిని ఉపయోగించు. ఒకరోజు ఎన్నిటిని కాలుస్తావో. వాటియెత్తు సుద్ద కణికెలు దగ్గర ఉంచుకో. సిగరెట్టు కాలుస్తూ ఉన్నంత సేపూ ఆ సుద్దతో పలకపైని నాపేరు వ్రాసి, దానిని దిద్దుతూ ఉండు. మర్నాటి ఉదయానికి కొన్ని సుద్దకణికెలు మిగిలిపోతాయి. అవి వేగంగా అరగవు. మర్నాడు ఆ సుద్దముక్కల యెత్తు సిగరెట్లను మాత్రమే త్రాగు. ఇంకా అవి మిగిలిపోతాయి. ఈ పద్ధతిలో కణికెలు అయిపోయిన పిదప నాదగ్గరకురా. కావలిస్తే కొత్త కణికెలు ఇస్తాను" అని గురువుగారు చెప్పారు. ఆయన పెట్టిన నియమాన్ని అనుసరించి సిగరెట్లు కాలుస్తూ సుద్దకణికెలను ఉపయోగించాడు. దినక్రమాన సిగరెట్ల సంఖ్య తగ్గిపోసాగింది. చివరి దినాన ఒక సుద్దముక్కే ఉండినది. దానియెత్తు సిగరెట్టు చాలాస్వల్పం, ఈ విధంగా ఆ ధూమపానం దినక్రమాన తగ్గిపోయి సిగరెట్లు కాల్చకపోతేనేమి? కాలం గడవదా? ఈ చెడ్డ అలవాటును ఎందుకు మానుకోకూడదు?" అనే సంకల్పం తనః తనే ఏర్పడినది. ఆమర్నాడు గురువుగారి దగ్గరకు అతడు వెళ్ళాడు. "ఏమి నాయనా! చాక్‌పీసులు అన్నీ అయిపోయాయా? ఇంకా కావలిస్తే చెప్పు" అని ఆయన ప్రశ్నించారు.

శిష్యుడు "గురూజీ! మరి సుద్దముక్కతో పనిలేదు. నిన్న సాయంత్రం నుంచి నేను సిగరెట్లు కాల్చడం మానుకున్నాను. నాకే బాధ అనిపించడంలేదు. క్రమక్రమంగా వాటి సంఖ్యను తగ్గించి నిన్న ఒకటంటే ఒకటే కాల్చాను. ఇక నాకు వాటిమీద అపేక్షలేదు. మీరు నన్ను అవితాగడానికి అనుమతిస్తూనే క్రమంగా, సున్నితంగా నా దురభ్యాసాన్ని పోగొట్టారు. నేను వాటిని మానగలనని ఎన్నడూ అనుకోలేదు. నా కృతజ్ఞతను మీకు ఎలా తెల్పాలో తెలియకున్నది" అన్నాడు.

"నాకు ఏ కృతజ్ఞతా చెప్పనక్కరలేదు మీరంతా ఇట్టి అలవాట్లు మానివేసి ఆరోగ్యం కాపాడుకుంటే అదేమాకు పదివేలు" అని చెప్పి పంపివేశాడు.

ఏ దురభ్యాసమున్నా దానిని తప్పించడానికి సులభోపాయాన్ని అన్వేషించాలిగాని నిర్బంధంవల్ల ఏటువంటి ప్రయోజనమున్నూ ఉండదు. ఇది శ్రీ గణపతి సచ్చిదానందస్వామిజీ చెప్పిన విషయం.

— బులుసు వేంకటరమణయ్య

## 'వర్ణ' చిత్రాలు

[వీరాజీ]

### సోడా బజ్జీ

హెడ్డుగారి పర్మిషన్‌తో హై
రోడ్డుమీద 'డేరా' వేసి నిమ్మకాయ
సోడాలమ్మే ఎల్లారావు ముక్కుపిండి
వసూల్చేస్తున్నాడు రూపాయిపావలా బజ్జీ లావ్!

మరి మంచినీళ్ళు ఇవ్వకుండా
మిర్చీ బజ్జీలు అమ్ముతాడుగా!

### టిటుపోటు

ఎండాకాలంలో నిద్రపట్టక సిన్మా పాటలు
పలవరిస్తూ అటు ఇటూ దొర్లే బెజవాడ పట్టణం

బైస్కోపు లారగించి, వాళ్ళూరి బస్సు మిస్సై
సెంటర్లోకొచ్చి గోల్డ్‌స్పాటిమ్మన్నాడు బుల్లెబ్బై

వెంటనే దొరికావు చాలు నీ కేసు
'రమ్మ'ని పట్టుకున్నాడు పోలీసు



# హైదరాబాద్ నోట్ బుక్

## బాలల "ఆంధ్రప్రదేశ్ దర్శన్" పర్యటన సమాప్తి

రాష్ట్రంలోని నాలుగంచులనుంచి ప్రతిభావంతులైన బాల బాలికలను కొందరినిఎంచుకొని రాష్ట్రంలోని ఆర్థిక, పారిశ్రామిక, సాంస్కృతిక ప్రాధాన్యంగల ప్రదేశాలు వారికిచూపించి, వారిలోను, వారిద్వారా ఇతర బాలబాలికలలోను సంకుచిత ప్రాంతీయ దృష్టిని తొలగించి, వారి మన:కేదారాలలో సమైక్యభావపు నారులు పోయడం, అనే సత్కార్యంకోసం ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ గడచిన మే 12 వ తేదీనుంచి నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ దర్శన్ విజ్ఞానయాత్ర విజయవంతంగా జూన్ 13 వ తేదీతో సమాప్తమైంది, యాత్రనుంచి తిరిగి వచ్చిన బాల బాలికలను గవర్నర్, ముఖ్యమంత్రి సచివాలయంలో ఆశీర్వదించారు. జవహర్ బాలభవన్ ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియంలో జరిగిన వీడ్కోలు సమావేశానికి విద్యామంత్రి శ్రీమండలి కృష్ణారావు అధ్యక్షత వహించి, పిల్లలకు తగు ఉపదేశమిచ్చారు. ఈ విజ్ఞాన యాత్రలో దాదాపు 60 మంది విద్యార్థులు పాల్గొన్నారు. వీరంతా ఈ సంవత్సరం జనవరి నెలలో జరిపిన ప్రతిభాపాటవ పోటీలలో జిల్లాకు ఇద్దరు చొప్పున నెగ్గిన 44 మంది బాలబాలికలు, ఈ సంవత్సరం ఫిబ్రవరిలో జరిగిన ప్రతిభాపాటవ పోటీలో ప్రథమ బహుమతి పొందినవారు, బాలసంఘాల ప్రతినిధులు మొత్తం 60 మంది 12 మొదలు 15 లోపు వయస్సువాళ్ళున్నారు. వీరివెంట శ్రీయుతులు మద్ది పట్ల వెంకటరావు, కవిరావు, పాలడుగు నాగయ్య వర్ణ చలన చిత్రం తీయడానికి శ్రీ పేకేటి శివరామ్ బృందం, ఇతర సహాయకులు మొత్తం.... మంది ఉన్నారు. వీరంతా రెండు డీలక్స్ బస్సులు, ఒక ఫిలిం యూనిట్ వ్యాన్‌లలో బయలుదేరి 21 జిల్లాలలో 6,500 కిలోమీటర్ల ప్రాంతం పర్యటించి రాష్ట్రంలోని అతి ముఖ్యమైన 60 స్థలాలు చూచారు. ఈ ఆంధ్రప్రదేశ్ ధర్శన్ విజ్ఞాన యాత్రను బాలల అకాడెమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బారాయన్ సమర్థతతో నిర్వహించారు.పిల్లలకెవరికీ ఎలాటి బాధ కలుగకుండా, సకల సౌకర్యాలు కలిగిస్తూ, ఎప్పటికప్పుడు వారి బాగోగులు చూస్తూ, బాధ్యతతో, వోర్పుతో యాత్ర నిర్వహించిన మిత్రులు శ్రీ సుబ్బరాయన్ అభినందన పాత్రులు. విద్యామంత్రి శ్రీ మండలి వారన్నట్టు బాలల నగరం కూడ ఏర్పాటుచేసి, మనరాష్ట్రాన్ని ఇతర రాష్ట్రాలకు ఒరవడిగా చేయగలరని కూడ ఆశిస్తున్నాను.

## ఇద్దరు ప్రముఖుల రాజీనామా

రాష్ట్ర కాంగ్రెస్ సంఘం ప్రధాన కార్యదర్శి, విధాన సభ సభ్యులు, కరీంనగర్ జిల్లా కాంగ్రెస్ నాయకులు శ్రీ వి. జగపతిరావు విధాన సభ సభ్యత్వానికి, కాంగ్రెస్ పార్టీ ప్రాథమిక సభ్యత్వానికి, రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి పదవికి జూన్ 17 న రాజీనామా ఇచ్చారు. జిల్లా ప్రజల ఇష్టానుసారం వైదొలగుతున్నానని ఆయన ప్రకటన చేశారు. మంత్రి పదవికి కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చిన శ్రీ సాగి సూర్యనారాయణరాజు జూన్21వ తేదీన విధాన సభలో తన రాజీనామా కారణాలను వివరించారు. నిలకడలేని నిర్ణయాలు, అనిశ్చితపరిస్థితి, అంతా నేనేననే అహంకారంతో వ్యవహరించడం ప్రస్తుత ముఖ్యమంత్రి ప్రత్యేకత కావడం వల్ల అలాటి నాయకత్వం కింద పనిచేయు దలచక, కాంగ్రెస్ పార్టీ ప్రజాసేవ విస్మరించి రాజకీయాలు ప్రధానమై దేవుడులేని గుడిగా మారడం వల్ల తాము రాజీనామా ఇచ్చామని ఆయన స్పష్టపరచారు.

## అధ్యాపకేతర సిబ్బంది సమ్మె

ప్రభుత్వ సహాయంపొందే పాటశాలల, కళాశాలల అధ్యాపకేతర సిబ్బంది రాష్ట్రమంతటా జూన్ 22 నుంచి ఆరంభమైన నిరవధిక సమ్మెను బలపరుస్తూ సెక్రటేరియట్ సమీపంలో కొందరు ఆ మరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. 22 వ తేదీన ఈ సిబ్బంది స్థానిక వివేకవర్ధినీ కళాశాలనుంచి మొజంజాహి మార్కెట్, గాంధిభవన్ల మీదుగా విధాన మండలివరకు బ్రహ్మాండమైన వూరేగింపు జరిపింది. ఇతర ఉద్యోగులకు ఇచ్చినట్టుగా, 1975 మే నుంచి కొత్త జీతాల బకాయీలు, 1973 ఏప్రిల్ నుంచి ●ంచను, వీరి ముఖ్యవాంఛితాలు.

## నగరంలో దోపిడీలు

ఇటీవల నగరంలో దోపిడీలు తీవ్రమై ప్రజలను భయాందోళితులను చేస్తున్నాయి. జూన్‌నెలలో మల్కాజ్‌గిరిలో జరిగాయి. సైదాబాద్ సుబ్రహ్మణ్యం కాలనీలో దోపిడీ జరిగింది. నారాయణ గూడాలోని దర్జీషాపులో వస్త్రాపహరణం జరిగింది. డి.ఎం.ఎం. లాబ్సకాలనీలో దొంగలు ఒక ఇంటిపైపడి, యజమానిని గొడ్డలితో కొట్టి నగలు దోచుకున్నారు. రామంతపురంలో ముఖానికి నల్ల ముసుగులు కప్పుకున్న 15, 16 మంది దుండగులు వెంకట నరసయ్యసంతులు అనే వ్యక్తి ఇంటిపై దాడిచేసి, బయటివారు రాకుండా కాపలావుండి దోపిడీచేసి, ప్రజల గోలతో పోలీసు విజిల్ వినబడగానే పారిపోయారట. నగరంలోనే ఇలా వుంటే, తక్కిన ప్రాంతాల గతి ఏమిటి ?

## ఉపశ్రుతి

'ఏమిటో కథలు చెప్పుకుంటున్నారు. నేనెందుకు మధ్యన పానకంలో పుడకలాగా!' అన్నాను ఒక గృహస్థు ఇంటిలో ప్రవేశించి, ఏదో మాటాడుకుంటున్న యజమానిని గృహిణిని చూచి. పక్కనే వున్న తోటి పత్రికా రచయిత్రి సోదరి శ్రీమతి లక్ష్మి వెంటనే అందుకొని, 'సొంత మొగుళ్లతో కథలేమిటుంటాయి ?' అని చలోక్తి విసిరారు.

— తిరుమల రామచంద్ర



విశాఖపట్టణం ఓడరేవులో జెట్టీమీద "ఆంధ్రప్రదేశ్ దర్శన్" బాలలు. పక్కన వున్నది ఆసియాలోకెల్లా పెద్దదయిన వేలాడే క్రెయిన్ "భీమా"

# ఓ మనస్విని కథ

మద్దా
వెంకటరమణారావు

(గత సంచిక తరువాయి)

**అ**తను ఒకరోజు ఎందుకో మూడీగా వున్నారు. చాలా సీరియస్‌గా ముఖంపెట్టి అన్నారు "సుగుణా! ఎప్పుడో ఒకనాడు నువ్వు నన్ను వదిలి పోవని నమ్మకం ఏమిటి?"

"మీకెందుకా అనుమానం?"

"నీలాటి అందమైన ఆడది భార్యగా వుంటే మగాడికి ప్రతి క్షణం భయంగానే వుంటుంది ఏ క్షణం వదిలిపోతుందో అని..."

'ఆడది అందంగా వుంటే మొగుణ్ణి వదిలి పోతుందని మీ నమ్మకమా?"

"అందుకు అవకాశం వుందని నా నమ్మకం—"

"ఎలాగ?"

"అందమైన ఆడదానిచేత ఆకర్షింపబడుతూ తమ వలలోకి లాగుదామనే మగాళ్లు చూస్తారు"

"అందరు మగాళ్లూ అంతేనంటారా?"

'చాలామంది అంతే..."

"మీ ఎరికలో ఎందరు స్త్రీలు తమ భర్తలని వదిలి వెళ్లిపోయేరు?"

"వదిలి వెళ్లిపోకుండానే మరో మగాడితో గ్రంథం నడిపిన స్త్రీలు నాకు తెలుసు..."

"నేను ఆ పని చేస్తాననే మీ అనుమానమా?"

"అటువంటి అనుమానం వుండక్కర్లేదని హామీ యిస్తున్నావా?"

"నమ్మకం లేనప్పుడు హామీ యిచ్చినా నమ్ముతారా?"

"నమ్ముతాను — దానికో పరీక్ష వుంది..."

"ఏమిటా పరీక్ష?"

"ఇది కోయవాళ్లలోనూ, అడవిజాతుల వాళ్లలోనూ యింకా వుంది."

"ఏమిటది?"

"మరొకడ్ని ముఖం ఆకర్షించకుండా వుండడానికి పచ్చబొట్లు వేసుకుంటారు...'

"నా ముఖంమీద చుక్కలు వేసుకొని అందవికారంగా చేసుకోమంటారా?" ఆశ్చర్యపోతూ అడిగేను కోపంగా.

"అదుగో చూసేవా? అందం అన్న ప్రశ్న వచ్చేసరికి ఆడది మొగుడ్నన్నా వదిలేస్తుందికాని తన అందాన్ని పాడవనివ్వదు కోరి కోరి .. నీకూ అదే ఉద్దేశమా?"

"నా ఉద్దేశమల్లా మీకు అందంగా కనిపిద్దామనే. నేను అందవికారంగా తయారయితే మీరే వదిలేస్తారు నన్ను మర్నాడే. నా నాశనాన్ని నన్నే కోరుకోమంటార్రా?"

"నాకు నువ్వెలావున్నా అందంగానే వుంటావు..."

"మీకదే ఆనందం యిస్తే నా ముఖమల్లా బొట్లు వేయించండి."

"ముఖం అందవికారం చెయ్యను నువ్వు నా మనిషివని, నా భార్యవని, ఎవరికన్నా తెలిసేలా నీ శరీరంమ్మీద పైకి కనిపించనిచోట్ల పేరు ముద్ర వేస్తాను. ఊరుకోగలవా?"

"ఎందుకు మీకా కోరిక?"

"నువ్వు అందుకు ఒప్పుకున్నప్పుడు, నువ్వు నాపట్ల విశ్వాసంగా వుంటావని నమ్మగలను!"

"అప్పుడు పరపురుషుడిని కోరనని నమ్మకం ఏమిటి?"

"ప్రాణం పోవాలికాని, నువ్వు నేను నీ శరీరంమీద వేసిన గుర్తులని మరో మగాడిముందు ప్రదర్శించలేవు. అందువల్ల పైమగాళ్లకి దూరంగా వుంటావు. అర్ధమయిందా?"

"అర్ధమయింది."

"ఏమంటావ్? కాదంటే, నీకు నీ శరీరాన్ని పైమగాడికి ప్రదర్శించాలన్న ఉద్దేశం వుందని గ్రహిస్తాను..."

"ఎందుకు కాదంటాను? ముఖంమీదకూడా వేసుకోండి కావలిస్తే. ఈ శరీరంమీద మమకారం నాకేనాడో పోయింది. ఏం చేస్తారో చేసుకోండి..."

అలా నన్ను మాటలతో రెచ్చగొట్టి ఆ పనికి ఒప్పించేరు. అందుకు కొన్ని ఆకుపసర్లు సంపాదించేరు — కొన్ని పనిముట్లు సంపాదించేరు... వాటితో ఆ గుర్తులని వేసేరు."

నాకు మరి వినాలనిపించలేదు అతడు ఆమెని పెట్టిన బాధలు — అందుకే అడిగేను... "మీ అక్క సంధ్య యెలా ప్రవేశించిందో అది చెప్పు చాలు..."

"అక్క నన్ను మనసారా ద్వేషించడం ఆరంభించిదికదా? తనకు దక్కవలసిన రంగారావుని నేను కుట్రపన్ని పెళ్లాడేనని ఆమె నమ్మింది. తాను యెంత మానసికంగా బాధపడుతోందో నేనూ అంతే బాధపడాలని కోరుకుంది. ప్రతీకారానికి అవకాశం వస్తే జారవిడుచుకోకూడదనుకుంది. ఆమెకి రంగారావుమీద కోపం లేదు. ప్రతి మగాడి అందమైన ఆడది కనిపిస్తే నిగ్రహం వుండద ఆమె నమ్మకం. అది పురుష సహజం అనుకుంది ఆడదానికి నిగ్రహం వుంటే మగాడు ఆమె జోలి వెళ్లలేడని ఆమె నమ్మకం — అందువల్ల తప్పంత నామీదే తోసింది.

"అక్క ఎదురుచూస్తున్న అవకాశం దొరకనే దొరికింది. నేను అయిదోనెలతో ఉన్నప్పుడు అమ్మ నన్ను చూడ్డానికి అక్కని తీసుకొని వచ్చింది హైదరాబాదునించి, ఎస్కార్ట్‌గా. వాళ్లిద్దరూ పదిహేనురోజు లుండి వెళ్లిపోయేరు. కాని పదిహేను రోజులలోనూ ఇద్దరూ ఒకరిమీద ఒకరికుండే కోపాన్నీ, విరాగాన్నీ, దూరాన్నీ మరిచిపోయేరు. ఇద్దరూ సాహిత్యం గురించి మాట్లాడుకున్నారు. తను రాసిన కవిత అతడికి చదివి వినిపించింది అక్క. తను రాసినవి ఆమెకి అతడు చదివి వినిపించేడు. వాళ్ల భాష నా కర్ధమయ్యేదికాదు. అక్కా, అతనూ నేనూ పిక్చర్లకి వెళ్లేం. వారిద్దరిమధ్యా నేనే పైమనిషిని అనిపించింది. వాళ్ల సంభాషణలో పాలుపంచుకోలేకపోయేదాన్ని.

"షాపింగనీ, కొందరు స్నేహితురాళ్లని చూడడానికనీ అక్క వెళ్లినప్పుడు అతనూ ఆమెకి తోడుగా వెళ్లేవాడు. వాళ్లెక్కడికి వెళ్లి వచ్చేవారో నాకు తెలిసేదికాదు."

"మీపట్ల మీ అక్క ప్రవర్తన యెలా ఉండేది అప్పుడు?"

"చాలా ప్రేమగా ప్రవర్తించింది. నాకు రెండు చీరలు, ఒక రిస్టువాచీ కొనియిచ్చింది, నాకు అనుమానం రాకుండా. పైపై నటన అదని నాకు తెలియలేదు. నన్ను హైదరాబాద్ తీసుక వెళ్తానంది అమ్మ. అతను పంపనన్నాడు. నా ఒంటిమీది వాతలు వాళ్ల కళ్లపడకూడదని అతని వుద్దేశం. అమ్మ నాకు పుల్ల పోస్తానన్నా ఒప్పుకోక నా స్నానం ఒంటిగా చేసేదాన్ని. పదిహేను రోజుల తరవాత అక్కా అమ్మా వెళిపోయేరు.

"అక్కకీ అతనికీ మధ్యన ఉత్తరప్రత్యుత్తరాలు ఆరంభం అయ్యేయి. అతను క్యాంపులు వెళ్తూవుంటారు. ఆఫీసు కొచ్చిన ఉత్తరాలు అతను క్యాంప్‌కి వెళ్లినప్పుడు ఆఫీసు ప్యూను ఇంటికితెచ్చి యిస్తాడు. ఒకసారి ఒక కవరు వచ్చింది. ఆ దస్తూరీ పోల్చి విప్పేను. ఫ్రమ్ ఎడ్రస్ లేదు ఉత్తరంమీద — ఎవరికీ ఆఫీసులో

---

***జరిగిన కథ-9 :*** అనసూయ అక్కకీ, అన్నకీ పెళ్లయిపోతుంది. తండ్రి వుద్యోగంనుంచి రిటైరైపోతాడు. ఆర్థికబాధలు మనుషుల్ని ఎలా మార్చేస్తాయో అనిపిస్తుంది అనసూయకి అన్నని చూస్తుంటే. అనసూయ పెళ్లి ఆ యింట్లోవారికి ఓ సమస్య. ఎస్.ఎస్.సి. పాసయిన అనసూయ చదువు ఆగిపోతుంది ఆర్థిక యిబ్బందులవల్ల. ఆడపిల్లలకి చదువనూ, వ్రాయనూ నేర్పించటానికి బడి పెడ్తారు అనసూయా కనకదుర్గ. చిన్నతనంలోనే వైధవ్యం పొందిన స్నేహితురాలు నిర్మల చేత మెట్రిక్‌కు కట్టిస్తుంది అనసూయ. భర్త వదిలేసిన సుగుణతో పరిచయమవుతుంది అనసూయకి. తన జీవితంగురించి అనసూయకు చెప్పటం మొదలెడ్తుంది సుగుణ. సుగుణ అక్క సంధ్య. రంగారావ్‌ను ప్రేమించిన సంధ్య అతడ్ని నమ్మి తన శీలాన్ని అర్పిస్తుంది. నువ్వునాకు జీవితాంతం ఉంపుడుకత్తెగా వుంటానంటేనే నీ అక్కను పెళ్లాడతానంటాడు రంగారావ్ సుగుణతో. తను కోరినట్లు శీలం పోగొట్టుకోటానికి సుగుణ అంగీకరించకపోవటంతో సంధ్యకి పన్నవకుమార్ అనే అతనికీ అక్రమసంబంధం సృష్టిస్తాడు రంగారావ్. రంగారావ్ వేసుకున్న పథకం ప్రకారం సుగుణకి అతనితో పెళ్లవుతుంది. సుగుణ తనని మోసం చేస్తుందేమోనన్న అనుమానంతో ఆమెని మానసికంగా శారీరకంగా హింసించటం ప్రారంభిస్తాడు రంగారావ్.

అనుమానం రాకుండా — ఉత్తరం చదివేను. అందులో ఆమెకి అతనిమీద యెంత ప్రేమ వుందో రాసింది. అతడి కామెమీది ప్రేమ హిమాలయమంతయితే, ఆమె కతడిమీది ప్రేమ మేరుపర్వతమంతట. కవిత్వమూ, అదీ కలిపి రాసిన ప్రేమలేఖది. సంగతంతా అర్థమయింది. కాని ఏం చెయ్యడం ?

"నాకు కోపం ఆగలేదు. ఇద్దరిమీదా — యిద్దరూ నాకపకారం చేస్తున్నవాళ్లే — నా కిష్టం లేకుండా నా కిష్టానికి వ్యతిరేకంగా నన్ను పెళ్లాడి, బానిసలా వాడి, నన్ను యమయాతన పెట్టినవాడు ఆ మగాడు — నా తప్పేమీ లేకపోయినా, నామీద కక్షకట్టి యిప్పుడు నా భర్తని నాకు కాకుండా చేద్దామని చూస్తోంది నా అక్క. ఈ ఇద్దరిమధ్యా పడి నా జీవితం నలిగిపోయింది. ఇప్పుడా యిద్దరూ, నలిగి పిప్పినయిన నన్ను పెంటకుప్పమీద పారేసే యెత్తుతో వున్నారు.

"నేను వెంటనే ఆ ఉత్తరాన్ని ఒక కవర్లో పెట్టి అమ్మకి పంపేను మరో ఉత్తరం జతచేసి. అక్క యెటువంటి పని చేస్తున్నదో, అందరూ కలిసి నా బతుకునెలా నరకం చేసేరో, ఇప్పుడు ఒక పిల్లపుట్టి ఒకదారిన నా జీవితం పడుతున్న వేళకి నా భర్తని యెలా నానించి వేరుచేద్దామని చూస్తోందో రాసేను. అమ్మ ఆ ఉత్తరం అక్కకి చూపకుండా, నన్ను తొందర పడొద్దని జవాబు రాసింది.

"ఈమధ్యని నాకు నెలలునిండి రాధ పుట్టింది. అమ్మ వచ్చింది — అమ్మతోకూడా అక్క వచ్చింది. పదిరోజులు అక్కా, అతనూ విచ్చలవిడిగా తిరిగేరు— నేను ఏమనుకున్నా ఖాతరులేదన్నట్టు.

అమ్మకి నా వాతల సంగతి తెలిసిపోయింది. ఏడ్చింది అమ్మ. పాత కథంతా చెప్పగా విని, గరిద్దరికీ పెళ్లి చెయ్యనందుకూ, నామాటలు ఆనాడు విననందుకూ వాపోయింది. అక్కతో మాట్లాడిందట — కాని అక్క అమ్మ మాటలని లెక్కచెయ్యలేదు. "నాకు భర్త అవవలసినవాడిని అది చేసుకుందికదా ... అది చాలదా ? నేను అతన్ని ప్రేమిస్తే దానికేం పోయింది ? నాకేం మిగిలింది కనక ? పెళ్లా...మొగుడా...పిల్లలా...సంసారమా? మా ఇద్దరిమధ్యా వున్న బంధాన్ని అది తెంచలేదు!" అని అందిట.

నేను ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చేను. ఈ ఇద్దర్నీ నిలదీసి అడుగుతే లాభం ఏముంటుంది? రహస్యం బయటపడిపోయేక మరి వున్న భయమూ లేకుండా విచ్చలవిడిగా తిరుగుతారు. అప్పుడు మా యిద్దరికీ పూర్తిగా చెడిసిపోవచ్చు.

పదిరోజుల తరవాత అక్క వెళ్లిపోయింది. అమ్మ కొన్నాళ్లు వుండి వెళ్లింది. అమ్మని దిగబెట్టే నెపంమీద అక్కడికి వెళ్లి పదిరోజు లుండి వచ్చేరు అతను.

తిరిగి వచ్చినప్పట్నుంచీ అతని పద్ధతే మారిపోయింది. పెళ్లాం అన్న మనిషి ఇంట్లో ఒకర్తె వుందనికూడా మరిచిపోయేరు. ఇంటిపట్టున వుండడంకూడా తగ్గింది. ఈ పనీ ఆ పనీ అంటూ తిరగడం. వేళపట్టున యింటికి రాకపోవడం. రాత్రి ఎప్పుడో పడుకోడానికి రావడం — రాధ పుట్టినప్పట్నుంచీ అతను వేరేగా పడుకోడం ఆరంభించేరు. అదలా అలవాటుకింద మార్చుకున్నారు. ఎందుకలా చేస్తున్నారని నేను అడగలేదు. నన్నతను శారీరకంగానూ, మానసికంగానూ బాధపెట్టడం తప్పిపోయిందని ఆనందించేను. కాని అనుకోకుండా నీలి ఆకాశంలోంచి నా నెత్తిన పడింది పిడుగు!

నన్ను సంభాషణలోకి దించి తన మనసులోని భావం చెప్పేరు ఒకనాడు.

"నన్ను నువ్వు పరిస్థితులకి లొంగి పెళ్లాడేవ్ అవునా ?"

"ఆ సంగతి యిప్పుడెందుకు ?"

"నన్ను వదిలి పోగలుగుతే ఏ క్షణమన్నా పోవాలనే నీకుంది... ఔనా ?"

"మిమ్మల్ని వదిలిపోయే స్థితిలో వున్నాననే మీ వుద్దేశమా ?"

"ఒకవేళ వున్నావనుకో ఆ స్థితిలో ?"

"ఉన్నప్పుడు నేను వెళ్లిపోయేనా ? ఇప్పుడు ఆ ప్రశ్నే లేదు"

"నాతో జీవితాన్ని ఖైదులా భరిస్తున్నావ్... ఔనా ?"

"భర్తతో జీవితం భార్యకి ఖైదెలా అవుతుంది ?"

"నీతో నేను సుఖపడ్డాననే నువ్వు అనుకుంటున్నావా ?"

"నాకెలా తెలుస్తుంది? అది మీకే తెలియాలి."

'ఒక ప్రియుడికి అతడి ప్రియురాలిచ్చే తృప్తీ, ఆనందమూ నువ్వు యివ్వగలిగేవా నాకు ?"

"నేను మీకు ప్రియమయినదానినో కానో మీరు నిర్ణయించుకున్నాక ఆ ప్రశ్న అవసరం వుండదు. ప్రియమైనదానినే అయితే ఆ ఆనందం మీకు దొరికేవుంటుంది — అప్రియమైన దానినయితే మీకా ఆనందం నేనిచ్చినా మీకు కనిపించివుండదు."

"ఇష్టంలేని వాతావరణంలో జీవితాంతం వుండడంకన్న వేరు వేరుగా మనం జీవితాలని గడుపుతేనే ఉత్తమంగా వుంటుందంటాను. ఏమంటావు?"

నా మనసులో చెప్పలేని భయం ప్రవేశించింది. ఏంచెయ్యడం యిప్పుడు ? అతడు ఏం చెయ్యబోతున్నాడో గ్రహించేను. అతడి కాళ్లమీద పడితే నేను కించపడడం తప్ప ఏమీ లాభం వుండదు. ఎలా ఈ ఆపదని తప్పించుకోడం ? ఇతడి మనసులో ప్రవేశించిన విషబీజాన్ని ఎలా నిర్మూలించడమో అర్థంకాలేదు —

"హిందూ ధర్మం ప్రకారం, భార్యాభర్తల మధ్య వచ్చే పొరపొచ్చాలేవీ పరిష్కారం కానంత పెద్దవి కావు — ఇద్దరికీ ఎడబాటు కలిగేది చావుతోనే... బతికుండగా మాత్రం కాదు." అని చెప్పేను.

"నీ మెడలో కట్టిన తాడు దేవుడిచ్చినదనుకున్నావా ?"

"అది ఒక తాడు కాదు. ఒక సూత్రం — ఒక ధర్మం — అందుకే దానిని మంగళసూత్రం అన్నారు — ఏ అమంగళమూ జరగకుండా రక్ష అది —"

"నేను, నీకు పుస్తె కట్టిన రోజునే చచ్చిపోయి వుంటే, ఆ మంగళసూత్రాన్ని పట్టుకొనే శేష జీవితం గడిపివుందువా ?"

"జరగనిదానిని జరిగిందని ఎలా అనుకోగలను... ?"

"సుగుణా ! ఒక సంగతి చెప్పు — పుస్తె కడితేనేకాని ఆడది భార్య కాదా ?"

"అది ఒక బంధమని చెప్పేనుకదా ?"

"పుస్తె కట్టకుండా ఒక స్త్రీకీ, పురుషుడికీ సంబంధముంటే ఆమె అతడి భార్య కాదా ?"

"శారీరకమైన సంబంధం ఒక్కటే భార్యాత్వాన్నీ, భర్తృత్వాన్నీ యిచ్చేదు ! ఇద్దరూ ఒక గృహం ఏర్పరచుకోవాలి — అప్పుడు అతడు గృహస్థుడూ ఆమె గృహిణీ అవతారు. తరవాత పిల్లలూ ... సంసారం ఏర్పడతాయి. సంసారంపట్ల కొన్ని ధర్మాలు నిర్వహించాలి. అవి చేస్తూ జీవితమల్లా ఆ సంసారంలో వుండేవాడే భార్యాభర్తలు. శరీర సంబంధం వున్నంతమాత్రాన భార్యాభర్తలెలా అయిపోతారు చెప్పండి ?"

ఆ జవాబుకి మరికొంతసేపు ఆలోచించి అన్నారు ... "నేను నీ అక్క సంధ్యకి అన్యాయం చేసేను. ఔనంటావా, కాదంటావా ?"

"ఏవిధంగా అన్యాయం చేసేరు ? దానిని పెళ్లాడకపోవడం అన్యాయం అంటారా ? నన్ను పెళ్లాడి దానికి అన్యాయం చేసేరంటారా ?" నాలో ఉబికి వస్తున్న కోపాన్ని, దుఃఖాన్నీ అణచుకుంటూ అన్నాను. పిల్లి ఎలకతో చెలగాటం ఆడినట్టు ఆడుతున్నాడు.

"దానిని పెళ్లి చేసుకోక అన్యాయం చేసేను... ఒప్పుకుంటావా ?"

"సరే ఒప్పుకుంటాను..."

"అందువల్ల నీ అక్కకి యింతవరకూ పెళ్లి కాలేదు. ఒప్పుకుంటావా ?"

"అది నాకు తెలీదు — దానికో ఉద్యోగం వుంది. నెలకి నాలుగువందలు జీతం వస్తోంది అందం వుంది — అది పెళ్లి చేసుకుంటాననాలేకాని పెళ్లికొడుకులకి కొదవేముంది ?"

"మరెందువల్ల కాలేదంటావ్ ?"

"దానికి చేసుకోడం యిష్టంలేక కాలేదు.'

"దాని కెందు కిష్టం లేదంటావ్?"

"మగాళ్లంటే నమ్మకంలేక అయ్యుండొచ్చు ఒక కారణంవల్ల జీవితంలో దెబ్బతిన్న మనిషి ఆ కారణం దగ్గరకి మరి వెళ్లదు."

"ఒక అన్యాయం ఆమెకి నేను చేసేనుకాబట్టి ఆ అన్యాయాన్ని తొలగించి న్యాయం చేకూర్చే బాధ్యత నాకు లేదంటావా ?"

"ఆ బాధ్యత మీమీద వున్నప్పుడు, అది నిర్వర్తించడానికి మీకు అవకాశం వున్నప్పుడూ అది నిర్వర్తించలేకపోయేరు. పెళ్లి కాకుండానే దాని శీలంతో చెలగాటమాడి దానికి అన్యాయం చేసేరు. దానిని పెళ్లాడి ఆ అన్యాయాన్ని సరిదిద్దవలసిన బాధ్యత మీమీద వున్నప్పుడు మీరు నిర్వర్తించలేదు. దానిని వదిలి నన్ను పెళ్లాడేరు. మరి యింక దానిపట్ల ఏవిధమైన బాధ్యతకానీ, దానితో మాట్లాడే హక్కుకాని మీకు లేవు. మీ బాధ్యతంతా నాపట్లే అది పెళ్లికాని పరస్త్రీ. మీకు పెళ్లయింది — పెళ్లాన్నయిన నేను బతికున్నాను. ఏ హక్కుతో మీరు దాని అన్యాయాన్ని యిప్పుడు తొలగిద్దామనుకుంటున్నారు ? ఒక మనిషిని

చంపేసేక మళ్ళా బతికించగలరా ? అందుకని మరో మనిషిని చంపుతారా ?''

"మీకేమౌతుందో చెప్పండి వదిన?'' అడిగేను— అతను మాట్లాడలేదు.

"వదిన అవుతుంది — ఔనా? చెప్పండిప్పుడు— మీ వదినకి మీరేం అన్యాయం చేసేరు ?''

"మీ అక్కకి నావల్ల...''

"నా అక్క సంగతి మరిచిపోండి. మీ వదిన సంగతి చెప్పండిప్పుడు — పాత కథ, నన్ను మీరు పెళ్ళి ఆడగానే ముగిసిపోయింది.''

అతను మాట్లాడలేదు. ఆ సంగతి చాలా రోజుల వరకూ మరి ఎత్తలేదు.

కొన్నాళ్ళతరవాత ఆఫీసు పని మిషతో అతను హైదరాబాదు వెళ్ళేరు. అక్కడ నాలుగు రోజులుండి వచ్చేరు. వచ్చేక అతని ధోరణే పూర్తిగా మారిపోయింది. ఈసారి నాతో మాటలు కూడా తగ్గించేరు. అతను తిరిగివచ్చేక నా పేర అక్క దగ్గర్నించి ఒక పెద్ద కవరు వచ్చింది రిజిస్టర్డ్ పోస్టులో — వణుకుతున్న చేతులతో విప్పేను. అక్క నా పేర రాసిన ఉత్తరం అందులోంచి పైన పడింది.

అందులో ఒక ఫోటో వుంది. ఆ ఫోటో చూడగానే నా ముఖం తిరిగింది. నెత్తిన పిడుగు పడింది. అక్కా, నా భర్త తీయించుకున్న ఫోటో అది. ఇద్దరి మెడలల్లో, పూలహారాలు — అక్క నుదుట పెళ్ళిబొట్టు. మంగళసూత్రం కనబడేలా పైన వడేసింది. ఉత్తరం చదివేను —

సుగుణా !

నిన్ను చెల్లీ అని పిలవడానికి నాకు సిగ్గుగా వుంది. నువ్వు నా చెల్లెలివి ఎలాగౌతావు ? చెల్లెలెక్కడన్నా తోబుట్టువుని వెనకపోటు పొడుస్తుందా? నువ్వు నన్ను వెన్నులో పొడిచేవు. నాకూ అతనికీ వున్న సంబంధం అతడు చెప్పినాకూడా అతన్ని లోబరచుకొని, నాకు భర్త కావలసిన మనిషిని నాకు కాకుండా చేసేవు.

కాని సుగుణా ! దేవుడున్నాడు పైన! అన్యాయం చేసినవాళ్ళని సులువుగా వదిలిపెట్టడు. అన్యాయం చెయ్యబడ్డవారి ద్వారానే తగిన శాస్తి చేయిస్తూవుంటాడు. నువ్వు దొంగలాడి ఎత్తుకపోయిన వస్తువుని తిరిగి దక్కించుకుందుకే నేను బతికి వుండిపోయేను. నాకు తెలుసు — ఎప్పుడో ఒకనాడా మనిషి నా దగ్గరకి రాకతప్పడని.

నేను అనుకున్నదానికన్న వేగంగానే అతడికి నీమీద మోజు తగ్గిపోయింది. నావేపు మొగ్గేడు. నువ్వెలా అతడ్ని పాదాక్రాంతుడిగా చేసుకున్నావో నేనూ అలానే అతడ్ని నా పాదాక్రాంతుడిగా చేసుకున్నాను. నేను అతడికి లొంగలేదు సినిమాలకీ పార్కులకీ తిరిగేం — ఎన్నో సంగతులు గంటల తరబడీ మాట్లాడుకున్నాం — కాని నా చిటికిన వేలన్నా ముట్టుకోనివ్వలేదు అతడ్ని. ముష్టివాడిలా నా కాళ్ళమీద పడ్డాడు. ఔను. ఆ ఫోటో ఎవరన్నా తీసివుంటే అది చూసి నువ్వెంత ఆనందించి వుందువో !

ఒకే షరతు పెట్టేను — అతను నన్ను పెళ్ళాడాలి. అగ్నిసాక్షిగా, పెద్దల సమక్షంలో — తన ఉద్యోగం పోతుందన్నాడు పోతేపోనీలెమ్మన్నాన కాని అతడు నాకు పుస్తె కట్టాలి. ఆఖరికి నే చెప్పిన షరతు లన్నింటికీ ఒప్పుకొని నాకు తెలిసి అందరి సమక్షంలోనూ వెంకటేశ్వరస్వామి కళ్యా మండపంలో హైదరాబాద్‌లో క్రిందటి ఆదివార అగ్నిసాక్షిగా పుస్తె కట్టేడు.

నాకిప్పుడు రంగారావుతో పెళ్ళయింది - నువ్వు నాకు చేసిన ద్రోహానికి నీమీద ప్రతీకారం తీసుకున్నాను. అంతే చాలు నాకు ! యిప్పుడు రం నా భర్త ! యింతటితో అయిపోలేదు సుగుణా ! నా భర్త నీతో యింక యెలా వుంటాడు ? ఆనాడు అచ్చయిన మొదటి శుభలేఖ కాపీలున్నాయి నాదగ్గర. అందులో నా పేరూ, రంగారావు పేరూ వున్నాయి. ఆనాడే మా పెళ్ళి అయినట్టు లెక్క. నువ్వు అతన్నికాని నన్నుకాని ఏమీ చెయ్యలేవు. నీకు పుస్తె కట్టినవాడెవడో మాకు తెలీదు. నీకు పుస్తె కట్టినవాడు మరో రంగారావని చెప్పడానికెందరో వున్నారు. అమ్మ ఏం చేస్తోందా ? నా కన్యాయం జరిగినప్పుడేం చేసింది ?

నా భర్తకి యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయే ఏర్పాటు జరిగింది. రూల్సు ప్రకారం భార్యాభర్తలని ఒకేచోట వెయ్యాలికదా ? కాని మా పెళ్ళయి మూడేళ్ళయినా ఇంతవరకూ కోరలేదు ... ఇప్పుడు కోరుతున్నాం అని యిద్దరం అప్లికేషన్ను పెట్టేం...''

నేను మరి చదవలేకపోయేను. ఏడుస్తూ కుప్పగా కూలబడిపోయేను.

అతను వచ్చేకే ఉత్తరం, ఫోటో చూపించి ఏమిటీ అన్యాయం అన్నాను. న్యాయమే జరిగింది సంధ్యకి అని అన్నాడు. నాకు అన్యాయం చెయ్యడం దానికి న్యాయం చెయ్యడమా ? దేని సంగతి అదే అన్నాడు. మా యిద్దరికీ పెద్ద పోట్లాట అయింది. నన్ను కొట్టేడు...తన్నేడు. వదిలిపెట్టి పోతానని చెప్పేసేడు. వేరు మార్గంలేక అతని కాళ్ళమీద పడి నాకూ, రాధకీ అన్యాయం చెయ్యొద్దన్నాను.

"నేను నిన్ను వదిలిపోతాను. పుస్తె కట్టేనన్న మాటేకాని నిన్నేనాడూ భార్యగా చూడనేలేదు. నా అసలు భార్య సంధ్యే. నిన్ను నేను పెళ్ళే చేసుకోలేదు. నీకెవడో మరో రంగారావు అన్యాయంచేస్తే మరదలివికదా అని దయతలచి దగ్గర వుంచుకున్నాను.''

"ఏమండీ ... ఆడదానికి ఒకసారి అన్యాయం చేసేరు. మరోసారి అన్యాయం చెయ్యకండి. ఇది మీకు భావ్యంకాదు !'' అని రాధని తెచ్చి అతడి ముందుంచేను. కాని మైకంలోని మనిషికి వివేచనా జ్ఞానం వుంటుందా అనసూయా ?

నెల తరవాత అతన్ని హైదరాబాద్ వేస్తూ ఆర్డర్లు వచ్చేయి. నాకా ఆర్డర్లు చూపలేదు. క్యాంప్‌కని చెప్పి వెళ్ళి మరి తిరిగిరాలేదు. హైదరాబాద్ తిన్నగా వెళిపోయేరు. ఇంటికి కట్టవల్సిన అద్దె ఇంటాయనకి పంపేరు. నాకు ఉత్తరం రాసేరు. ఇల్లు కాళీచేసి చిన్న యింటికి పొమ్మన్నారు. "మరదలు సుగుణకి'' అంటూ సంబోధిస్తూ రాసేరా వుత్తరం. నన్ను పెళ్ళి



చేసుకొనేవాడు మరి కనిపించే అవకాశం లేదనీ, నేను అతనితో వుంటే లోకులు ఎన్నోరఖాల అనుకుంటారనీ...అందువల్ల నేను వేరేగా వుండడం మంచిదనీ ... అతనూ, అతని భార్యా నా జీవికకి నెలకి ఎనభై రూపాయలు పంపుతామనీ రాసేరు. ఇంటి సామాన్లు అవసరంలేనివి అమ్మేసి ఆ డబ్బు తీసుకోమన్నారు. అన్ని ఖర్చులకీ ఒక వెయ్యిరూపాయలు పంపేరు వేరేగా వుండడానికి నేను ఏర్పాట్లు చేసుకుందుకి

అది జరిగేక మరి విశాఖపట్నంలో వుండడానికి మనసొప్పక యిక్కడికి వచ్చేసేను, పాపని తీసుకొని."

"తరవాత అతన్ని చూడలేదా ?" అడిగేను.

"చూడలేదు — హైదరాబాద్ వెంటనే వెళ్దాం అనుకున్నాను. కాని నాలోని ఉత్సాహం వచ్చిపోయింది. బతుకంటే విముఖత కలిగింది. చచ్చిపోదామనిపించింది. కాని ఆత్మహత్య చేసుకొనే మనస్తత్వం కాదు నాది. నాదీ అక్కలాటి పట్టుదలే. రాధని పెంచి పెద్దచెయ్యాలి. దాని భావి బాగుపడాలన్న కోరిక ఒక్కటే నాలో వుంది. ఇది జరిగిన తరవాత అమ్మ నా దగ్గరికి వద్దామని ప్రయత్నించింది కాని వాళ్ళు రానివ్వలేదు. ఏడుస్తూ వుత్తరం రాసింది. నేను అక్కడికొస్తే నలుగురిముందూ వాళ్ళని నిలబెడతానంది. కాని నేను వెళ్ళినా నా గోడు ఎవడు వింటాడు ? వెళ్తే అవమానం తప్ప నాకేం దొరుకుతుంది ? అందుకే నేను వెళ్ళలేదు. ఇది జరిగిన ఏడాది తిరక్కుండా అమ్మ చచ్చిపోయింది. అమ్మ చచ్చిపోయి దినచర్యలయ్యేక కార్డుముక్క రాసిపడేసేరు.

చిత్రంగా వుందికదూ అనసూయా నా కథ ? కథలా రాస్తే యిలాటివి జరుగుతాయా అనిపిస్తుంది. చూసేవ్ కదా అనసూయా నా సంగతి ? ఇంతకన్న ఘోరమైన పరిస్థితులలో యిరుక్కున్న స్త్రీలు లేకపోలేదు — కాని ఎవరి సంగతీ పై ప్రపంచానికి తెలీదు. తెలిసినా ఆడదాని తరపున సమాజం అండగా నిలవదు. మగశక్తితో నిండివున్న ఈ లోకంలో, పురుషుడ్ని పురుషుడు సమర్ధించజూస్తాడు. ఆడది ఎదురు తిరుగుతే అణగదొక్కుతారు..."

"కాని అక్కా ! నీకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం జరిగితీరుతుంది !" ఆవేశంతో అన్నాను.

"ఒద్దమ్మా ! అటువంటి కోరికలు నాకు లేవు. ఎవరి పాపాన వాళ్ళే పోతారు. కాని నా కాళ్ళ మీద నేను నిలబడి, నా జీవనోపాధి నేను ఆర్జించుకుంటూ, రాధని పెద్దచేసి ఒక యోగ్యుడి చేతిలో పెట్టడమే నా జీవితాశయం యిప్పుడు. ఆ శక్తిని నాకివ్వమని దేవుణ్ణి రోజూ ప్రార్థిస్తాను." కన్నీళ్ళు కారుతూవుండగా, చేతులెత్తి కనిపించని దేవుడికి నమస్కరించింది సుగుణ.



## 13

సుగుణ చరిత్ర విన్నాక కొన్నాళ్ళవరకూ నా మనస్సు వికలమయింది.

ఏమిటీ లోకం ? ఒక మనిషికీ మరొక మనిషికీ ఆలోచనలలోనూ, కోరికలలోనూ, మంచి చెడుల భావనలలోనూ బేధం కనిపిస్తోందే ? ఆడదాని జీవితం యింత చవకబారుగా తయారయిందేమిటి ? ఇంత కనిష్టస్థాయిని అందుకుందేమిటి ? ఆడది మగాడికి లోకువా ? సంసారపు బరువు బాధ్యతలని మోస్తూ, సామరస్యం లేనపుడు పురుషుడు పెట్టే హింసలని భరిస్తూ జీవితం గడపవల్సిందేనా ? సుగుణకి అండగా ఎవ్వరూ ఈ ప్రపంచంలో ఎందుకు నిలబడలేకపోయేరు — పైగా తలొక రాయిగా విసురుతున్నారు. మన దేశంలోనే యింతా, ప్రపంచం అంతా యింతేనా స్త్రీల పరిస్థితి ?

ఆమె కథ విన్నాక మగాళ్ళన్నా, పెళ్ళన్నా భయంపుట్టింది నాలో. పురుషుడంటే అపనమ్మకం ఏర్పడింది. వారనే మాటలకి, స్త్రీలకి సంబంధించినంతవరకూ, యెంత విలువని యివ్వవచ్చు ? నన్ను అత్తవారింటికి, పెళ్ళిచేసి పంపించేసేక నా జీవితం యెలా వుంటుందో ? ఆ మగాడు ఎలా వుంటాడు? దయగా చూస్తాడా ? అదీ లాటరీయేనా? దేవుడా ! నాకు పెళ్ళి మాత్రం వద్దు ! అని రోజూ మొక్కుకున్నాను. రంగారావెవరో నాకు తెలీకపోయినా, ఒకరాత్రి కలలో ఒక భయంకర ఆకారం కాల్చిన ఇనపకడ్డీ పట్టుకొని నాకు వాతలు పెట్టడానికి వస్తున్నట్టు కనిపించగా కెవ్వున కేకవేస్తూ లేచిపోయేను. వదిన పరుగెత్తుకుంటూ వచ్చింది. "ఏమిటే అనసూయా ? ఏమయిందే?" "ఒక రాక్షసుడు కలలో కనిపించేడు వదినా !" అన్నాను వణికిపోతూ. "నీళ్ళు తాగి వత్తిగిలి పడుకో !" అంది వదిన

ఒకటి రెండు నెలల తరవాత ఆ భయం తగ్గింది. మగాళ్ళలోకూడా మంచివాళ్ళు తప్పకుండా వున్నారు. సుగుణ దురదృష్టవశాత్తూ ఒక దుర్మార్గుడిచేత పడింది—వాడి బాధ తప్పిపోడంవల్ల నిజంగా బతికింది.

స్కూలు యధాప్రకారం నడుస్తోంది. పిల్లలు పదివరకూ పెరిగేరు. కాలేజి లేనిరోజున సుగుణ వచ్చి పిల్లలకి పాఠాలు చెప్తోంది. నిర్మల యిప్పుడు సాయంత్రమేకాక, ఉదయంకూడా వస్తోంది పుస్తకాలు తెచ్చుకొని: దుర్గపిన్ని యొక్క గదిలో కూర్చొని పాఠాలు చదువుకుంటోంది. ఇప్పుడిప్పుడు పిల్లలు చేసే అల్లరి చూసి నవ్వుతోంది. వాళ్ళచేత దుర్గమ్మ పాటలు పాడించినప్పుడు తనూ శృతి కలుపుతుంది. ఆమె జీవితం మళ్ళా చిగురించ సాగింది. ఆమె నవ్వుతూ ఆనందంగా వుండడానికి యెవరికన్నా యెందుకు అభ్యంతరం వుండాలి ?

---

### 'బంతుల' బెల్టు

కాలిఫోర్నియాలోని బ్రిడ్జెన్ ఇంటర్నేషనల్ సంస్థ ఉత్పత్తిచేసి కొత్తగా విడుదల చేసిన ఈ బెల్టులో పది టెన్నిస్ బంతులని అమర్చుకోవచ్చు. దీనివల్ల ఆడేవారు బంతికోసం వేచిఉండే సమయం కలిసివస్తుంది. అందరికీ సరిపోయేలా, తేలకగా, ఉతికడానికి వీలుగా, ఆకర్షణీయంగా ఉంటాయివి.

ఇది యిలావుండగా బంగారయ్య అతడి భార్య రుక్మిణమ్మని బడి కొకనాడు తీసుకవచ్చేడు. (పిల్లలు పోవడంవల్ల చిత్తచాంచల్యం కలిగిందని చెప్పేను కదూ యిదివరకు?) పిల్లలతో మాట్లాడిందామె కార్యక్రమాలలో ఉత్సాహం చూపింది. ఆ మర్నాడూ వచ్చింది. మిఠాయి తెచ్చి పిల్లలకి పంచింది. మూడోనాడు ఆమె రావడం ఆలస్యం అయ్యేసరికి పిల్లలందరూ ఆమెకోసం ఆత్రంగా యెదురుచూడసాగేరు. ఆమె యీసారి పిల్లలకోసం గౌనుగుడ్డలు తెచ్చింది. దారిలో కొన్నదట. పిల్లలకి బట్టలూ, నాకూ దుర్గపిన్నికీ చీరలూ తెచ్చియిచ్చింది. మేం వద్దన్నా విన్నదికాదు. దుర్గపిన్ని ఆమెని దీవించింది — యీసారి కాన్పు తప్పకుండా దక్కుతుంది, కనకదుర్గమ్మని పూజించమంది. రుక్మిణి దుర్గపిన్ని మాటలమీద నమ్మకం పెట్టుకుంది. రుక్మిణి వయసు ముప్ఫయి దాటుతాయి — చామనఛాయవన్నె. పొడుగాటిజుత్తు. కళ్లు అందమైనవే అయినా, ఇద్దరు పిల్లలు పుట్టిపోవడంతో ముఖంలో విచారం గూడు కట్టుకుంది.

రుక్మిణి వారానికి మూడుసార్లన్నా వస్తోంది. రాను రాను ఆమె మనస్తత్వంలో మార్పు వచ్చింది. పిల్లల్ని చూడగానే ఉత్సాహం చూపుతోంది. వాళ్లతో ఏవేవో ఆటలు ఆడింపిస్తోంది. ఆ ఆటలు ఆడించడానికి కొన్ని వస్తువులు కొంది. భార్యలోని మార్పుని గమనించి బంగారయ్య సంతోషించేడు. దుర్గపిన్ని మాటలమీద గురి ఎక్కువయింది.

* * *

స్కూలుకి ఇప్పుడు కావల్సినంతమంది అమ్మగార్లున్నారు. కాని యెవరికీ జీతం నాతం లేదు. ఒకరిద్దరు పిల్లలు రెండేసి రూపాయలు తీసుకొచ్చేరు నెలాఖరున. జీతం ఇచ్చుకొనే తాహతు యెవ్వరికిలేదు. దుర్గపిన్ని ఆ డబ్బు వాపసిచ్చేసింది. ఒకరిదగ్గర తీసుకొని ఒకరిదగ్గర మానుతే, డబ్బు యిచ్చుకోలేని పిల్లలు బాధపడతారంది.

"మీ స్కూలుకి గ్రేంటు వచ్చేలా చూస్తాను." అన్నాడు బంగారయ్య ఒకరోజున.

"ఏం గ్రేంటు యిస్తారోకాని ... సవాలక్ష ప్రశ్నలువేసి నా ప్రాణం తింటారు — నాకుండే స్వతంత్రత పోతుంది..." అంది దుర్గ.

"పోనీ మా వర్తక సంఘంనించి నెలనెలా డొనేషన్ ఏర్పాటు చేస్తాను ... మీ చేతి డబ్బు ఖర్చుకాకుండానూ..."

"అందుకు నాకేం అభ్యంతరంలేదు..."

ఆదయేక, వారంరోజుల తరవాత, స్కూలు ఖర్చులకోసం నెలనెలా ఏభైరూపాయల డొనేషను వర్తక సంఘంవారు మంజూరు చేసేరు. స్కూలు వున్నంతకాలం ఆ డొనేషను యివ్వబడుతుంది — అదికాకుండా, విద్యార్థులు ఎక్కువయితే, విద్యార్థికి నెలకి ఐదుహొప్పన డొనేషను పెంచబడుతుంది. మా శ్రమని ఇతరులు గుర్తించేరన్న నిజం మాకు యెంతో తృప్తినిచ్చింది. ఆ డొనేషన్ రాగానే రాబోయే ఆదివారం బడి పిల్లలందరితోనూ పిక్నిక్‌కి అలివేణినీ, సుగుణనీ, నిర్మలనీ, వదిననీ ఆహ్వానించేం. ప్రతి ఒక్కరికీ వారి వారి పనులు అప్పగించేం.

ఆదివారంనాడు ఉదయమే బయల్దేరేం, కాలినడకని. వంటకి కావల్సిన పాత్రలు, దినుసులూ అన్నీ బంగారయ్యే, కావిళ్లతో పిక్నిక్ స్థలానికి పంపే ఏర్పాటు చేసేడు. రిక్షాలు ఆ స్థలానికి వెళ్లలేవు. ఊరుకి అవతలవున్న నల్లచెరువుగట్టు దాటేక కాలిదారి వుంది పొలాలలోంచి. కొంతదూరం వెళ్లేక ఒక పెద్ద మామిడితోట వస్తుంది. ఆ మామిడితోటే మా పిక్నిక్ స్థలం. అక్కడ రెండు బావులున్నాయి నేలవి, అక్కడి పొలాలకి నీళ్లకి. నీళ్లకి యిబ్బందిలేదు. తోట కెదురుగా వుంది యోగిగారి ఆశ్రమం. ఆశ్రమంచుట్టూ పూలతోట వుంది. ప్రదేశం ఎంతో సుందరమైనది.

మొత్తం అందరం ఇరవైమందిమయ్యేం. నడిచి ఆ స్థలానికి వెళ్లేసరికి తొమ్మిదయింది. అన్నకీ, నాన్నకీ తెల్లవారుజామునే లేచి వదిన వండేసింది. "వెళ్లిరండి! జన్మానికో శివరాత్రి!" అన్నాడు అన్న నవ్వుతూ. నా మేనగోడళ్లిద్దరూ

## మనసు విరిసిన మల్లె

మనసు పూదోటలో
మరుమల్లెయే ప్రేమ
ఆ ప్రేమ కుసుమమ్ము
అవని కామోదమ్ము.

ఆ సురభిళమ్మునకు
అవని రాదేది సాటి
ఆ ప్రేమ మధువునకు
అవని లేదేది పోటి.

మనసు మనుగడకదే
మనిషి ఆశల కదే
ఊపిరై నడిపించు
ఉన్మిసిత మందించు.

అమర పరిమళభరిత
మైనదే ప్రణయమ్ము
అది మనిషి మనసుకే
అగును నవ ప్రణవమ్ము

— రంగినేని సుబ్రహ్మణ్యం

కూడా పిక్నిక్‌కి వచ్చేరు. విశాలని రమ్మంటే రాలేనంది మొగుడు ఏమంటాడో అన్న భయంవల్ల. రేవతికూడా రాలేనంది.

వెళ్లి వెళ్లగానే పిల్లలందరినీ కర్రలకోసం పంపేం. దొరికిన చితుకులన్నీ ఏరుకరమ్మన్నాం. పావుగంటలో ఒక చిన్న కుప్ప తయారయింది. కావిళ్లు మోసుకొచ్చిన కూలీలచేత గాడి తవ్వించేం. ఈ చితుకులు చాలవు. వంటలకి కర్రలు కావాలి. ఈ చితుకులతో ఉప్మా, కాఫీ చెయ్యొచ్చు. చితుకులు అంటించి కాఫీకి నీళ్లు ఎక్కించేం. పెద్ద కళాయి యెక్కించి ఉప్మా చెయ్యడానికి ఉపక్రమించేం. వంటల దగ్గర దుర్గపిన్నీ, నిర్మలా, సుగుణా కూర్చున్నారు. నన్నూ అలివేణినీ వెళ్లి, ఎక్కడన్నా కర్రలు దొరుకుతే తీసుకరమ్మన్నారు.

నేనూ అలివేణీ కబుర్లు చెప్పుకుంటూ బయల్దేరేం. మాతో కొందరు పిల్లలు కూడ వచ్చేరు. అందరం యోగిగారి ఆశ్రమంలోకి వెళ్లేం.

ఆశ్రమంలో యోగిగారు అగపడలేదు. చిన్న ఆశ్రమాలలా నాలుగయిదు పూరియిళ్లున్నాయి. వాటిచుట్టూ పూలమొక్కలు...చేమంతి...బంతి... గులాబి... మల్లె... చెట్లు... చేమంతి... బంతి... గులాబులు విరబూసేయి. మల్లెల కాలం యింకా రాలేదు. జామచెట్లకి పళ్లున్నాయి. చుట్టూ వున్న జాగాలో కూరల మొక్కలు నాటబడ్డాయి. ఎన్నో కూరలున్నాయి.

మా కిద్దరు బాబాజీలు కనిపించేరు. ఒళ్లంతా విభూతి పూసుకొని, జడలు వ్రేలాడుతూ పురాణ పురుషులలా వున్నారు. చిన్న అంగవస్త్రాలు ధరించేరు కాషాయివి. వాళ్లిద్దరూ తోట పని చేసుకుంటున్నారు. మేం వచ్చినందుకు ఆశ్చర్యపోలేదు. ఇలా వన భోజనాలకి మనుష్యులు రావడం, వచ్చినప్పుడు ఆశ్రమం చూడడానికి రావడం పరిపాటి కామోసు. వాళ్ల పని వాళ్లు చేసుకుంటున్నారు.

అలివేణి అడిగింది. "బాబాజీగారూ... యిక్కడ వంటకి కర్రలెక్కడ దొరుకుతాయో చెప్పగలరా?"

ఇద్దరిలోనూ పొట్టిగా వున్నాయన తల ఎత్తి చూసి అడిగేడు "ఎన్ని కర్రలు కావాలి?"

అలివేణి నాకేసి చూసింది. "ఎన్ని కట్టెలు కావాలే అనసూయా?" నాకూ తెలీదు. అందుకు ఎన్ని కావాలో నిర్ణయించేపని అతనికే ఒప్పగించేను. "ముప్ఫయిమందికి వంటలవాలండీ..." అన్నాను.

"అయితే మూడు నాలుగు మోపులు వుండాలి. మీరు కర్రలు కొట్టగలరా?"

"నేనా? కర్రలు కొట్టడమా? ఈ చేతులతోనా?" అలివేణి అడిగింది.

"నువ్వు కాదమ్మా — కూలివాళ్లున్నారా?"

"ఉన్నారు..."

"అదుగో. ఆ ఎండిపోయిన మామిడిచెట్టుని కొట్టుకోండి. గొడ్డలి యిస్తాను."

ఆశ్రమంలో ఒక వారకి వుంది మామిడిచెట్టు. ఎండిపోయింది. కొమ్మలు లేవు. ఆ చెట్టు చచ్చిపోవడంవల్ల దానిని వంటచెరుకుగా వాడుకుంటున్నారు.

"రాధా! నువ్వెళ్లి కర్రల కొట్టడానికి కూలివాళ్లని రమ్మను..." అని రాధను పంపి నేనూ అలివేణీ ఆశ్రమం అంతా తిరిగేం. వాతావరణం ప్రశాంతంగా వుంది. తిరిగివచ్చి, యిద్దరిలోనూ ముసలిగా కనిపిస్తున్న బైరాగిని అడిగింది అలివేణి. "యోగిగారు ఆశ్రమంలో వున్నారా?"

"ఉన్నారు..." తన పని తాను చేసుకుంటూ జవాబిచ్చేడాయన.

"చూడొచ్చునా?"

"చూడవచ్చు..."

"ఇప్పుడేం చేస్తూవుంటారు?" అలివేణి అడిగింది.

"దేవుడి కిష్టమైన పని చేస్తూవుంటారు."

"ధ్యానమా?"

"ఔను!"

"యోగిగారిని మేం చూడొచ్చా?"

"చూడొచ్చు!"

అలివేణి కింత ఆసక్తెందుకో అర్థం కాలేదు. అలివేణి యివాళ తనకున్న అతి మంచి బట్టలు కట్టుకొనివచ్చింది. ఒంటిపేట గొలుసు మెడలో — రెండు జడలలోనూ పూలచెండ్లు. నుదుట దోస గింజ తిలకం. అలివేణి ఆకర్షణీయంగా వుంది. ఇష్టంలేక చదువు మానేసిందికాని, శ్రద్ధగా చదివే

## ఒక కన్య చెప్పిన కథ

వుంటే ఈసరికి కాలేజీలో చేరివుండును. మాట నేర్పరితనం, తెలివితేటలూ కల మనిషి. ఏదో ఒకటి అలా మాట్లాడుతూనే వుంటుంది వుదయం లేచి నప్పట్నించి. మాట్లాడనప్పుడు ఎక్కడ్నించో

తెచ్చిన డిటెక్టివ్ పుస్తకాలు చదువుతూ వుంటుంది. ఇంకా తోచకపోతే బంధువుల యిళ్లకి వెళ్లి ఏ సాయంత్రానికో వస్తుంది. ఆమె ఎక్కడికి వెళ్లినా పిల్లమ్మ ఏమీ అనదు. అంత గారాబం చేసింది.

[ఇంకా వుంది]

**అక్కినేని ... చిత్రల ప్రేమపురాణం**

అమెరికా నుంచి తిరిగొచ్చిన అక్కినేనితో శృంగార దృశ్యాలలో నటించే అవకాశం జయచిత్రకు లభించింది.

ఇద్దరూ కలిసి నటిస్తున్న మొదటి చిత్రం కూడా యిదే. విజయ...మాధవీ పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న చిత్రం తాలుకు మొదటి షెడ్యూలు కొడైకెనాల్‌లో వారంరోజులు జరిగింది. అక్కినేని...చిత్ర ఆనందపారవశ్యంతో గంతులేస్తూ, గిలిగింతలిస్తూ పాల్గొన్న రెండు పాటలను, దర్శకుడు తాతినేని చిత్రీకరించారు.

శ్రీ వడ్డె శోభనాద్రి నిర్మిస్తున్న యీ చిత్రానికి సత్యానంద్ రచన్ను, రాఘవులు సంగీతాన్ని, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని, జి. జి. కృష్ణారావు కూర్పును, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, రామమోహనరావు సహదర్శకత్వాన్ని, శరత్ సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ప్రధాన పాత్రధారులు: సత్యనారాయణ, రావుగోపాలరావు, రాజబాబు, మోహన్‌బాబు, జయమాలిని, హలం, ఛాయాదేవి, అల్లురామలింగయ్య.

**ఎన్టీఆర్ యింట క్యూ**

రోజా స్టుడియో దిశకు వెళ్లే నేను, ఎన్టీఆర్ యింట పది నిముషాలు ఆగడం యిటీవల ఎక్కువగా అలవాటు చేసుకొన్నాను.

నేను అక్కడ ఆగడానికి కారణం వుంది. రోడ్డుకు యిరువైపులా టూరిస్ట్ బస్సులు... కార్లు బారులుతీరి వుంటాయి. వేల సంఖ్యలో జనం ఆయన్ను చూడడంకోసం రోడ్డునిండా నిలబడి వుంటారు

పెరుగుతున్న ఆయన ప్రతిష్టకు ప్రేక్షకుల ఆనంద అభిమానాలే కారణమేమో అనిపించింది.

బయట ప్రేక్షక సందోహం, లోపల నిర్మాతల సమ్మేళనం. అందరికీ ఎన్టీఆర్ కావాలి. ఎందుకంటే ఆయన చిత్రాలు బంగారాన్ని పండిస్తాయి.

ఎన్టీఆర్‌గారి పాత చిత్రాలు యిప్పుడొస్తున్న కొత్తచిత్రాల లెవెల్‌లో వసూళ్లు యిస్తున్నాయి. ''ఎన్టీఆర్ యీజ్ గోల్డ్'' ... ఈ మాట అందరిదీనూ.

**త్రిమూర్తి ప్రొడక్షన్స్**

''భలేదొంగలు'' వర్ణ చిత్రాన్ని నిర్మించిన సాంబశివరావు ... బాబ్జీగార్లు (త్రిమూర్తి ప్రొడక్షన్స్) యీమారుకూడా అలాంటి ఉషారైన చిత్రాన్ని నిర్మించ పూనుకున్నారు.

జూన్ ఎనిమిది నుంచి వరుసగా పదిరోజులు జరిగిన షెడ్యూలులో ఆరు రీళ్ల చిత్రం వచ్చింది, అన్నారు దర్శకుడు కె. ఎస్. ఆర్. దాస్.

త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రంలో ప్రముఖ నటకులు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. వివరాలు: కృష్ణ, నాగభూషణం, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, జయప్రద, జయమాలిని, రమాప్రభ మరియు అల్లురామలింగయ్య.

ప్రేక్షకులు ఆశించే వినోదం ... శృంగారం... ఫైట్లు ... నృత్యాలు యీ చిత్రంలో వున్నాయి. ఇదొక యాక్షన్ థ్రిల్లర్.

**సత్యనారాయణ సుపర్బ్**

తెలుగు చిత్ర రంగమే కాదు... భారత చిత్ర రంగమే గర్వించదగ్గ గుణ చిత్ర నటుడు మన సత్యనారాయణ అని యీ విశేఖరి వ్రాస్తే, ఎవరికీ అభ్యంతరం వుండదనుకుంటాను.

హిందీలో ప్రాణ్, అశోక్‌కుమార్ వంటి మేధావులు వున్నారు. వారుకూడా సత్యనారాయణ ప్రతిభను మనస్ఫూర్తిగా కొనియాడకమానరు.

ఎస్. వి. ఎస్. ఫిలింస్ నిర్మిస్తున్న ''జీవితమే ఒక నాటకం'' చిత్రంలో సత్యనారాయణ ఒక బ్రాహ్మడి వేషాన్ని వేస్తున్నారు. అలాంటి పాత్ర వెయ్యడం ఆయనకు యిదే ప్రథమం

ఆ విప్రుడి వేషంలో సత్యనారాయణ చేస్తున్న నటన అందరికీ ఆశ్చర్యపరుస్తుంది. [ఉచ్చారణ... ఆ గెటప్‌లో వలసిన అన్నీను.] సత్యనారాయణ సుపర్బ్ అనిపిస్తుంది.

సత్యనారాయణ సుపర్బ్‌గా నటిస్తుంటే, ఆయన సహధర్మచారిణి ''షావుకారు'' తక్కువ చేస్తుందా? ''ఇద్దరూ యిద్దరే'' అనిపిస్తున్నారు.

ప్రజాదర్శకుడు దాసరి ఎన్నో మంచి చిత్రాలను రూపొందించారు ఆయనకు ''జీవితమే ఒక నాటకం'' కొత్త తరహా చిత్రం అవుతుంది.

మధ్య తరగతి బ్రాహ్మడి కుటుంబంలో వచ్చే సమస్యలు, వాటి పరిణామాలు ఎలా వుంటాయో నిరూపించే చిత్రమే ''జీవితమే ఒక నాటకం''.

స్వర్గీయ జగన్నాధరావుగారి నలుగురబ్బాయిలు నిర్మిస్తున్న యీ చిత్రంలో ప్రభ, దీప, చంద్రమోహన్, మోహన్‌బాబు, నాగేష్, భాను ముఖ్య పాత్రధారులు.

ఈ చిత్రానికి రమేష్ సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, భాస్కరరాజు శిల్పాన్ని నిర్వహిస్తున్నారు

ఆగస్టు 11న యీ చిత్రం విడుదలవుతుంది.

**మనుషులు చేసిన దొంగలు**

హీరో కృష్ణ సమర్పణలో యు. సూర్యనారాయణ బాబుగారు నిర్మిస్తున్న భారీ రంగుల చిత్రానికి పెట్టిన పేరే ''మనుషులు చేసిన దొంగలు.'' యం. మల్లికార్జునరావుగారి దర్శకత్వంలో శ్రీ పద్మావతీ పిక్చర్స్ తలపెట్టిన యీ వర్ణ చిత్రం షూటింగ్ జూన్ 20న ప్రారంభమై, 24 వరకూ జరుగుతుంది. జులై 1 నుంచి 15 వరకూ పెద్ద షెడ్యూల్‌ను ప్లాన్ చేయడం జరిగింది.

నాచురల్ స్టార్ కృష్ణ, రెబల్ స్టార్ కృష్ణంరాజు కథానాయకులుగా నటిస్తున్న యీ చిత్రంలో మంజుల ఒక ముఖ్య భూమికను ధరిస్తోంది. త్రిపురనేని మహారథి మాటలు వ్రాసే యీ చిత్రానికి సత్యం సంగీతాన్ని, పుష్పాల ఛాయాగ్రహణాన్ని, కె. రామలింగేశ్వరరావు కథను, కె. గోపాలరావు కూర్పును సమకూరుస్తున్నారు.



'జీవనతీరాలు'లో ఒక దృశ్యం



'చిల్లరకొట్టు చిట్టెమ్మ'లో జయచిత్ర

### ఊరుమ్మడి బతుకులు చిత్ర విశేషాలు

"కొలిమి పని చేయడం గన్నయ్య వృత్తి. ఆ వూరు పెదకామందు, రాయుడుగార్ల ఆదేశాను సారం గన్నయ్య అప్పుడప్పుడు పట్నం వెళ్తోన్తుంటాడు. ఆరోజు కూడా ఏదో పనిమీద పట్నం బయల్దేరాడు. గన్నయ్య భార్య సీతాలుకి ఆ పెద కామందు, రాయుడుగార్ల ప్రవర్తనేమి నచ్చదు. వారికింద బానిసలుగా మనమెందుకు పని చెయ్యాలనేదే ఆమె వాదన. కానీ ఏ ప్రయోజనం. గన్నయ్యకు వాళ్ల మాటంటే వేదం. భర్తతో ఎన్నోసార్లు చెప్పిచూసింది. కానీ ఆ మాటలు అతని చెవిన పడలేదు. పట్నం వెళ్తున్న గన్నయ్యకు పైపంచె అందించి మాపటికి వచ్చేస్తావా అని అమాయకంగా అడిగింది సీతాలు. "మాపటికి రావడానికి పట్నం మన పోలేరమ్మ గుడి ఎనకాతల వుందేంటి? పది మైళ్లు నడిసిరావాల" అంటూ ముందుకడుగేశాడు గన్నయ్య. భర్త వెళ్లినవైపే దిగాలుగా చూస్తూ నిలబడింది మాధవి.

గ్రామాల్లో బీద, బిక్కి ప్రజలు, పాత పద్ధతుల్ని అనుసరించాల్సిందే అని పట్టుబట్టిన అమాయకులు ఎలా పెత్తందార్ల కబంధ హస్తాల్లో నలిగిపోతారనడానికి గన్నయ్య, సీతాలు జీవితం ఒక నిదర్శనం. అదే మా ఆర్ట్ ఎంటర్ ప్రైజస్‌వారు పదిహారు రోజుల్లో పూర్తిచేసిన "ఊరుమ్మడి బతుకులు" కథ ప్రధానాంశం' అన్నారు దర్శకుడు బి. యస్. నారాయణ.

ఈ చిత్రాన్ని గూర్చి చెబుతూ మరికొన్ని ముఖ్యమైన విషయాలను వెల్లడిచేసారు దర్శకుడు బి. యస్. నారాయణగారు "సి. యస్. రావుగారు వ్రాసిన "ఊరుమ్మడి బతుకులు" నాటకం బాగా పాపులర్ అయిన నాటకం. ఒక గంట నడిచే ఈ నాటకాన్ని రెండు గంటలు చేసి అదే పేరుతో చిత్రంగా రూపొందించాము. ఈ చిత్రంలో ఎవరికీ మేకప్‌లు లేవు. రెండే రెండు పాటలు పెట్టాము. ఒక పాట శ్రీశ్రీగారి మహాప్రస్థానం నుంచి





'కొండరాజు—కోయపిల్ల'లో లక్ష్మి

## సినిమా విశేషాలు

తీసుకున్నాం. మరొక పాటను కోపెల్ల శివరాంగారు వ్రాసారు రీ-రికార్డింగ్ కూడా చాలా తక్కువ వాయిద్యాలతో, పరిచయమైన వాయిద్యాలతో చేసాము. పసుమానుల అనే గ్రామంలోనే మొత్తం చిత్రాన్ని పూర్తిచేసాము. సెట్స్ వేయడం జరగ లేదు. సహజత్వంకోసమని అక్కడి ప్రజల యిండ్లను, పాత్రలను వాడడం జరిగింది. అసహజత్వం అనేది ఎక్కడా కన్పించదు. ఒక ప్రయోగాత్మక చిత్రం తీశాము కష్టపడి. ఇక మాకు కావల్సింది ప్రేక్షకాదరణే."

"తెలుగు చిత్రాలకు జాతీయ అవార్డు రావడం లేదనే కొఱత తీర్చడానికి తయారైన చిత్రమే 'ఊరుమ్మడి బతుకులు'. వాస్తవికత వుట్టిపడే చిత్రాలు రావడంలేదనే నిందను మాపడానికి నిర్మితమైన చిత్రమే 'ఊరుమ్మడి బతుకులు'. ఎంతో వుత్సాహంతో, వ్యాపార దృష్టితో కాకుండా యిలాంటి చిత్రం నిర్మించిన నిర్మాతలు జి. కె. మూర్తి, జె. వెంకటార్యగార్లను అభినందించడం మన కనీసధర్మం. వారి శ్రమను, వారి అభిరుచిని వుచితరీతిని సత్కరించడం ప్రభుత్వ ధర్మం" అంటున్నారు చిత్రం చూచిన పెద్ద పెద్ద వక్తలు, వ్యక్తులు.

### మండుటెండలో షటిల్ కాక్

మిట్టమధ్యాహ్నం 12 గంటలప్పుడు ఏ. వి. యం. గార్డెన్స్‌లో షటిల్‌కాక్ ఆడుతూ కన్పించారు కమెడియన్ సారథి, కుమారి మాధవి ఒకరోజు. ఏ ఏ. సి. రూమ్‌లోనో కూర్చొని గాలి పీల్చాల్సిన యీ సమయంలో ఆ యిద్దరూ షటిల్‌కాక్ ఆడుతుండడం చూచిన నేను సారథి దగ్గర కెళ్లి "ఏమిటీ అవస్థ. ఎండలో" అనడిగాను "ఎండనుకుంటే సన్నివేశం తీసేదెలా" అన్నారు సారథి. "మరి సన్నివేశం చెప్పారుకాదూ" అని మా సంభాషణాన్ని పొడిగించాను. "లక్షాధికారి కృష్ణంరాజుగారి ఏకైక అముంగు చెల్లెలు యీ మాధవి. వారి కార్ డ్రైవర్ని నేను మాధవిని చాలా మురిపెంగా పెంచారు వారి అన్నయ్యగారు. ఆమెకు షటిల్‌కాక్ ఆడడం ఓ సరదా. రోజూ యెవరో ఒకరు ఆవిడతో కల్సి షటిల్ కాక్ ఆడాల్సిందే. ఈరోజు ఎవరూ దొరకలేదు. నే దొరికాను. నాకా ఆ గేమ్ అడ్డం రాదు. ఆడకుంటే మా అన్నయ్యతో చెప్తానని బెదిరిస్తోంది మాధవి. అంటూ మాధవివైపు తిరిగారు సారథి. బెల్‌బాటమ్ పాంట్, దానిమీద బ్రైట్ వైట్ కలర్ స్కర్ట్ వేసుకుని చేతిలో బాట్ పట్టుకుని నిల్చున్న మాధవి గలగలా నవ్వుతూ "సారథిగారు చెప్పిందంతా నిజమండి" అంది. ఇంతలో హీరో కృష్ణంరాజుగారొచ్చారు స్పాట్‌కి. "మన అమర దీపంలో యిదో గమ్మత్తయిన సన్నివేశం" అన్నారు. గంట ఒకటయ్యేసరికి "బ్రేక్" అంటూ సిగ్నలిచ్చారు దర్శకుడు కె. రాఘవేంద్రరావు.

## ఇంద్రధనుస్సు ఇతివృత్తం

"ఇంద్రధనుస్సు" అంటే ఏడు రంగుల కలయికతో ఏర్పడిన ఒక స్వరూపం అని అందరికీ తెలుసు. అలాగే జీవితం అంటే సంతోషం, దుఃఖం, వైరం, వైషమ్యం, కలహం, స్నేహం, వీటన్నింటి సమన్వయమని ఏ కొందరికో తెలుసు. జీవితం ఒక రంగుల వలయమని, రసాల సమ్మేళనమని, తెలుసుకుంటూ పరిస్థితులతో రాజీపడుతూ. జీవితాన్ని సాగించినపుడే గమ్యం చేరుకోగలము. కష్టాల కడలిని దాటగలము; అనే నైజాన్ని నిర్ధుష్టపరుస్తూ నిర్మింపబడిన చిత్రమే "ఇంద్రధనుస్సు."

ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ బ్యానరుపై టి. సుబ్బానాయుడు, నన్నపనేని సుధాకర్ నిర్మించిన యీ కలర్ చిత్రంలో పెక్కు ఆకర్షణ లున్నాయి. హీరో కృష్ణ, మరికొంతమంది 17 గుర్రాలతో పాల్గొన్న పోలో గేమ్ యీ చిత్రంలో పెద్ద హైలైట్. ఊటీలో చిత్రీకరించిన పాటలు, సన్నివేశాలు మరొక హైలైట్.

హీరో కృష్ణ, శారద, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, శ్రీధర్, గిరిబాబు, శరత్‌బాబు, కాకరాల, జయభాస్కర్, సారధి, నాగేష్, పద్మనాభం, కాంచన, జయమాలిని, గిరిజారాణి, ఫణి, పుష్పకుమారి, వాణి, బేబి వరలక్ష్మి ప్రధాన పాత్రలను పోషించిన యీ చిత్రం యిటీవల మద్రాస్‌లో జరిగిన షూటింగ్‌తో పూర్తయింది.

ఆత్రేయ, జాన్సన్, మహదేవన్, భాస్కరరావు, రామలింగేశ్వరరావు, నరసింహారావు, బీరంగి మస్తాన్‌రావు వరుసగా పాటలు, మాటలు, సంగీతం, కెమెరా, కళ, కూర్పు, సహకార దర్శకత్వం సమకూర్చిన యీ చిత్రానికి వసూళ్ల బాపయ్య దర్శకత్వం వహించారు. లక్ష్మి ద్వారా యీ చిత్రం త్వరలో విడుదలౌతుంది.





'ప్రేమలేఖలు'లో జయసుధ

## సినిమా

*రంగనాథ్ లవ్‌మేరేజ్*

జూన్ 1వ తేదీ రాత్రి 8 గంటలప్పుడు టి. నగర్ తిలక్ రోడ్‌లోని జయభేరి ఆర్ట్ పిక్చర్స్ ఆఫీస్ ముందు మూడు, నాలుగు కార్లు నిలబడి వుండడం చూసిన నేను విశేషమేమిటో తెల్సుకుందామని ఓ కారు దగ్గర కెళ్లాను. రంగనాథ్, చంద్రమోహన్, ఈశ్వరరావు, రంగారావు, హరిబాబు వున్నారు ఆ కారులో. "ఏమిటి ఇందరు హీరోలు ఒకేసారి యెక్కడికి ప్రయాణం" అడిగాను. "దేవతలారా! దీవించండి! షూటింగ్ నల్లమలైతో ప్లాన్ చేసారుగా. అందుకే యీ ప్రయాణం" అన్నారు నవ్వుతూ రంగనాథ్. "రంగనాథ్ గారూ! వేంతవరకొచ్చింది మీ లవ్‌మేరేజ్" అని రంగనాథ్‌ని ప్రశ్నించేసరికి మిగతావాళ్లందరూ అర్థంగాక ప్రశ్నార్థకంగా ముఖం పెట్టారు. "కంగారుపడకండి. వారడుగుతున్నది నా లవ్‌మేరేజ్ గూర్చి కాదు. తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారి 'లవ్‌మేరేజ్' చిత్రం గూర్చి కదండీ" అని నవ్వే ప్రశ్నించారు రంగనాథ్. "దేర్ యు ఆర్. కరెక్ట్‌గా వూహించారు. ఇక చెప్పండి" అన్నాను.

"ఆ చిత్రంలో నేనొక డాన్సర్ని ప్రేమించి పెండ్లి చేసుకుంటాను. కొంతకాలం యిద్దరం కల్సి కాపురం చేస్తాము. ఆ డాన్సరు కొక దగ్గర బంధువుంటాడు. ఆమె నెలాగైనా సినిమాలో చేర్పించాలని అతని పట్టుదల. ఒకసారి ఆ అమ్మాయిని ఓ షూటింగ్ స్పాట్‌కు తీసుకెళ్తాడు. అక్కడ నృత్యం చేస్తున్న ఒక అమ్మాయి తప్పుగా నాట్యం చేయడం చూసిన ఆమె అలాకాదు, ఇలా చెయ్యాలి అని చేసి చూపిస్తుంది. అక్కడున్న వారందరూ అవాక్కయ్‌పోతారు. కానీ ఈ విషయం తన భర్తకు చెప్పదు ఆ అమ్మాయి. కొన్నాళ్లకు పేపర్లలో ఆ అమ్మాయి ఫోటోను చూసిన ఆమె భర్త నాకు తెలియకుండా యింత జరిగిందా అని బాధపడ్తాడు. పర్యవసానంగా కొన్ని మనస్పర్థలొస్తాయి భార్యాభర్తలమధ్య. చివరకు మళ్లీ కొన్ని పరిస్థితులవల్ల కల్సుకుంటారు. ఇదే "లవ్‌మేరేజ్" కథ అని ముక్తసరిగా ముగించాడు రంగనాథ్.

రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్ వారి యీ చిత్రం దాదాపు పూర్తయింది. టి. లెనిన్‌బాబు దర్శకత్వంలో రూపొందుతున్న యీ చిత్రంలో జయచిత్ర కథానాయిక పాత్రను పోషిస్తూంది.

*వెరైటీ పాత్రలో మోహన్‌బాబు*

ఒక చిత్రంలో మోహన్‌బాబు వున్నాడంటే, ఆ చిత్రంలో అతను తప్పకుండా విలనే అయ్యుంటాడని వూహిస్తుంటారు సాధారణంగా. ప్రజాదర్శకుడు దాసరి నారాయణరావుగారి దర్శకత్వంలో జి. జగదీష్‌చంద్రప్రసాద్‌గారు నిర్మించిన "ఇదెక్కడి న్యాయం" చిత్రంలో మోహన్‌బాబు వెరైటీ పాత్రలో కన్పిస్తారు. తలమీద టోపీ, కళ్లకు స్పెక్ట్స్ పెట్టి, అందమైన అమ్మాయిల కోసం గాలించే షోకిలారాయుడిగా ఈ చిత్రంలో అగుపిస్తారు మోహన్‌బాబు. ఈ చిత్రంలో మురళీమోహన్ చెల్లెలు జయమాలినిని ఒకానొక పెండ్లిసందర్భంలో కలుసుకుంటాడు మోహన్‌బాబు. ఆరోజు నుంచి మాలినిపై మనసుపడ్తాడు. మాలిని తలిదండ్రులను తియ్యటి మాటలతో బోల్తా కొట్టించాడు. మాలినిని ప్రేమ పేరుతో షికార్లకని, పిక్‌నిక్‌లకని తన వెంట త్రిప్పుకుంటాడు. తీరా జయమాలిని అన్నయ్య మురళీమోహన్ పెండ్లి మాట ఎత్తేసరికి మా తండ్రిగార్ని అడగండి. ఆయన "ఓకే" అంటే నేను "ఓకే" అంటాడు. వాళ్ల నాన్నగారు కట్నం అడిగారు. అడిగినంత యివ్వలేకపోయినా, యిస్తామన్న కట్నాన్నిచ్చి జయమాలినికి, మోహన్‌బాబుకి పెండ్లి జరిపిస్తాడు మురళీమోహన్.

మామూలుగా అన్ని చిత్రాల్లో ఘరానాగా, పొగరుగా, మొండిగా కన్పించే మోహన్‌బాబు యీ చిత్రంలో అలాంటివేం లేకుండా ప్రేమించిన అమ్మాయినే పెండ్లి చేసుకోవడం విశేషం కాదంటారా! కాదనలేము. అందుకే వెరైటీ పాత్రలో మోహన్‌బాబు అన్నాను.

ఎ. వి. యస్. అచ్యుతవల్లిగారి "ఇదెక్కడి న్యాయం" ఎవలాధారంగా నిర్మితమయిన యీ చిత్రానికి మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం దాసరి నారాయణరావుగారు సమకూర్చారు. సంగీతాన్ని రాజేశ్వరరావు, ఛాయాగ్రహణాన్ని కె. యస్. మణి, కళను భాస్కరరాజు, కూర్పును బాలు నిర్వహించగా, ప్రభ, జయసుధ, నరసింహరాజు, నిర్మల, రావి కొండలరావు ముఖ్య పాత్రలను పోషించారు.

'మల్లెపువ్వు'లో శోభన్‌బాబు, జయసుధ





'మాయిద్దరి కథ'లో ఎన్. టి. ఆర్., రాజబాబు

## సినిమా

### భీమునిపట్నంలో
### రామకృష్ణ, జయచిత్రల ప్రేమవిహారం

డైరెక్టర్స్ కాలనీలోని ప్రేమ్స్ కంబైన్స్ ఆఫీస్ కెళ్లాను వారి పిక్చర్ ప్రోగ్రెస్ ఏమిటో తెల్సుకుందామని. ఆ సంస్థ "ప్రయాణంలో పదనిసలు" అనే చిత్రాన్ని నిర్మిస్తున్న విషయం మీకు తెల్సిందే. కాకినాడ, అన్నవరం గెస్ట్‌హౌస్, కాకినాడ రైల్వే స్టేషన్, పోర్ట్, కాకినాడ సిటీ మున్నగు ప్రదేశాలలో షూటింగ్ పూర్తిచేసుకు వచ్చిన ప్రేమ్స్ యూనిట్‌ను అవుట్‌డోర్ విశేషాలేమిటో అడుగుదామని వెళ్లేసరికి ఆఫీస్‌లో ఆ చిత్ర దర్శకుడు యం. యస్. కోటారెడ్డిగారు కన్పించారు. నన్ను చూసి "ఇది వింటారా" అనడిగారు. వచ్చింది వినడానికేగా. చెప్పండి అన్నాను నేను. "హీరో రామకృష్ణగారు, హీరోయిన్ జయచిత్ర ప్రేమించుకున్నారు. ఏకాంత ప్రదేశాలలో ప్రశాంతంగా విహరించ నిశ్చయించుకున్నారు. "భీమునిపట్నాన్ని" తమ ప్రేమవిహార ప్రదేశంగా ఎంచుకున్నారు. కమ్మకమ్మటి కబుర్లతో, వెచ్చవెచ్చని గిలిగింతలతో హాయిగా, హుషారుగా విహరించసాగారు యిద్దరూ. మాటలు చాలవని తమ ప్రేమను పాటరూపంలో వ్యక్తపరిచారు. "తొలకరి సొగసరి రావే, జిలిబిలి వలపుల నీవే" అంటూ ఒకరిని గూర్చి మరొకరు పాడుతూ పొద్దంతా ప్రేమ సామ్రాజ్యంలోనే కాలం గడిపారు. మరి వారంత గాఢంగా, వలపు మాటలు చెప్పుకుంటూ, పాటలు పాడుకుంటుంటే మేం వూరుకుంటామా! వారి భావాలను, వారి భాషను, వారి రియాక్షన్లను కెమెరా ద్వారా ఫిలింలోకి యెక్కించేసారు మా కెమెరామెన్ పి. యస్. ప్రకాష్‌గారు" అని చెప్పడం ముగించారు కోటారెడ్డి. మరి మీరింతవరకూ చెప్పిన యీ ప్రణయం మీ "ప్రయాణంలో పదనిసలు" చిత్రంలోనిదేగా అనడిగాను. "అవునండీ! ఇదంతా ఆ చిత్రంలోదే. గమ్మత్తుగా వుంటుందని యిలా చెప్పాను." అన్నారు కోటారెడ్డి

యస్. బి. శంకర్రావు నిర్మిస్తున్న యీ చిత్రంలో రామకృష్ణ, సత్యనారాయణ, రావుగోపాలరావు, ప్రభాకరరెడ్డి, నాగేష్, పద్మనాభం, నరసింహరాజా, సారధి, మిక్కిలినేని, జయచిత్ర, మాధవి, జయమాలిని ముఖ్య పాత్రధారులు. యస్. అన్నారావు నిర్వహణలో తయారయ్యే యీ చిత్రానికి జంధ్యాల, పి. యస్. ప్రకాష్, శంకర్–గణేష్, సాంకేతిక సారథులు.



'ఇదెక్కడి న్యాయం'లో ఒక దృశ్యం

### సుమతి పాతివ్రత్యం.
### గోపి అయ్యో పాపం!

సుమతి, గోపి భార్యాభర్తలు తన భార్యతో కులాసాగా కబుర్లు చెబుతూ, జల్సాగా కాలం గడపాలని గోపీ ఆరాటం. మడి, ఆచారం, వుపవాసం అంటూ ఎప్పుడూ ఏదో ఒక నెపంతో భర్తను దూరంగా వుంచడమంటే సుమతికి బలే సరదా. పాపం గోపీ ఎన్నోసార్లు భార్యను వుడికించాలని, వూరించాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. జీవితంలో ఎలాగూ తన భార్య పొందు తనకు లభించదని నిశ్చయించుకున్నాడేమో గోపీ. కనీసం కలలోనైనా తమ సంసారిక జీవితాన్ని వూహించుకుందామనుకుని వూహాలోకంలో విహరించాడు కాసేపు.

"లగ్ తుమారే – లోక్కైక జావురే
ఏక్కైక ఏక్కైక లోక్కైక జావురే" అంటూ

తాను,

"గోపయ్యా – వాయించవయ్యా
అందాల నీ మురళి వాయించవయ్యా"

అంటూ తన భార్య సుమతి పాడినట్టు, ఆ పాటలో తామిద్దరూ పరవశించినట్టు రకరకాలుగా వూహించుకున్నాడు గోపీ.

ఊహాగానంనుంచి వున్న లోకంలోకి వచ్చేసరికి మళ్లీ మామూలే. సుమతి పాతివ్రత్యం, గోపీ అయ్యోపాపం!

ఈ గమ్మత్తయిన సన్నివేశం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "అర్ధాంగి" చిత్రంలోనిది. ఏ.వి. సుబ్బారావుగారి, మోహన్‌గాంధీ దర్శకత్వంలో పూర్తికావచ్చిన, యీ చిత్రంలో సుమతిగా రమాప్రభ, గోపిగా రాజబాబు నటిస్తున్నారు. మురళీమోహన్, చంద్రమోహన్, నాగభూషణం, అల్లు రామలింగయ్య, మోహన్‌బాబు, జయభాస్కర్, జయసుధ, సూర్యకాంతం, జయమాలిని ముఖ్య పాత్రలను పోషిస్తున్న యీ చిత్రానికి ప్రత్యగాత్మ గారు కథ, ట్రీట్‌మెంటు, సత్యానంద్ మాటలు, సుందరబాబు ఛాయాగ్రహణం, టి. చలపతిరావు సంగీతం, జి. వి. సుబ్బారావు కళ, కృష్ణస్వామి కూర్పు, పూర్ణచంద్రరావు నిర్మాణ నిర్వహణను నిర్వహిస్తున్నారు.

—శ్రీనివాస్

★ 'మాయింటి కథ'లో ఒక దృశ్యం ★

# అమెరికాలో తెలుగు సభలు

అమెరికా, కెనడా దేశాలలో నివసిస్తున్న తెలుగు కుటుంబాల ప్రతినిధులు తొలిసారిగా న్యూయార్కులో రెండు రోజుల సదస్సు జరుపుకొన్నారు. ఈ సదస్సులో 850 మంది పాల్గొన్నారు. వీరు తమ సమష్టి సమస్యలను చర్చించుకొన్నారు. సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించుకొన్నారు.

ఈ కొత్త సంస్కృతిలో పిల్లలను ఎలా పెంచుకోవాలో, గృహిణులు ఈ కొత్త వాతావరణానికి, కొత్త సమాజానికి ఎలా సర్దుబాట్లు చేసుకోవాలో వగైరా అంశాలను గురించి చర్చించుకొన్నారు. అమెరికాలో పుట్టిన తమ బిడ్డలకు తెలుగు భాష ఎలా నేర్పుకోవాలి, తెలుగు సంస్కృతికి, ఆచార వ్యవహారాలకు పిల్లలు అలవాటు పడేట్లు చేయటం ఎలా అనే అంశం గురించి కూడా వీరు చర్చించుకొన్నారు. ఈ సదస్సులో పలువురు స్త్రీలు, పిల్లలు కూడా పాల్గొన్నారు. ఈ సందర్భంలో తెలుగు సినిమాలు చూపారు. నాటకాలు వేశారు. కళా ప్రదర్శనలు, సంగీత కచేరీలు జరిగాయి.


'గడుసు పిల్లోడు'లో ఒక దృశ్యం

న్యూయార్కు నగరంలోని క్వీన్స్ అనే ఒక పేటలోని పాఠశాలలో మే 28–29 తేదీలలో ఈ మహాసభ జరిగింది. న్యూయార్కు, న్యూజెర్సీ, కనెక్టికట్ రాష్ట్రాల తెలుగు సాహిత్య, సాంస్కృతిక సంఘం అధ్యక్షులు డాక్టర్ గుత్తికొండ రవీంద్రనాథ్ కృషి ద్వారా ఈ సదస్సు ఏర్పాటైంది. ఈయన కృషికి అమెరికాలోని యితర తెలుగు సంఘాలు, ఆంధ్రప్రదేశ్‌లోని సాంస్కృతిక సంస్థలు తోడ్పాటు నిచ్చాయి. పశ్చిమ టెక్సాస్ మొదలు ఉత్తర కెనడా వరకు గల వివిధ ప్రాంతాలలో నివసించే తెలుగువారి ప్రతినిధులు ఈ మహాసభకు హాజరైనారు. ప్రస్తుతం ఉత్తర అమెరికాలో 4,000 దాకా తెలుగు కుటుంబాలు నివసిస్తున్నట్లు డాక్టర్ రవీంద్రనాథ్ చెప్పారు. ★

# కళాకారులిద్దరూ

**కె. యల్. ప్రసాద్.**

*(గత సంచిక తరువాయి)*

**త**నకి తండ్రి తాతల నుండి వారసత్వంగా వచ్చినట్టే, తను భక్తితో నిరంతరం పూజిస్తున్నట్టే రామ విగ్రహాన్ని తన అన్నగారు కావేరీ నదిలో పారేశాడు. ఎంత వెదికినా దొరకలేదు. వెతికి వెతికి వేసారేడు రాత్రి రాములవారు కలలో అవుపించి. ఏట్లో ఫలానాచోట వెతకమన్నారు. తెల్లవారింది. కావేరీ నదిలో దిగాడు — ''అదిగో రాములవారు — సీతాసౌమిత్రీ సమేతంగా ఎదురుగా వస్తున్నారు — 'నను పాలింప నడచివచ్చితివో — నా ప్రాణనాథ' — ఎంత దూరం నడచివచ్చావయ్యా! — నామీద ఎంత నిర్హేతుక జాయమాన కటాక్షమయ్యా నీకు! అదిగో నిండు కావేరీ రెండుగా చీలిపోయి నీకు దారిస్తోంది — 'అనుజ నయనా నీ మోము జూపవే' — అబ్బ! భరించలేను. నేను భరించలేను యీ ఆనందం — 'కరమున శర కోదండ కాంతితో' — ఎంత కృపయ్యా నేనంటే నీకు, నువ్వే నడచి వస్తున్నావే నా యింటికి. ఇంత అదృష్టమా నాకు! — 'గగ, పప, దద, సస' — ఈ జంట స్వరాల్తో నా గుండె పరిగెత్తుతూందయ్యా నీ దగ్గరకి — 'దగరిసదప, దరిస దప; గదపగరి, రిపగరిస' — ఈ దాట్లతో నా మనసు నీ దగ్గరకి దాట్లు వేస్తూందయ్యా. భరించలేను రామా! ఈ ఆనందం యిహ భరించలేను. 'ధరణి తనయతో త్యాగరాజార్చిత! నను పాలింప నడచివచ్చితివో — నా ప్రాణనాథ!' నా గుండె నిండిపోయింది. నీ నిండు కటాక్షంతో...''

ఆర్ద్రతతో నా హృదయం నిండిపోయింది. నా కళ్ల నుండి నాకు తెలియకుండానే నీళ్లు కారుతున్నాయి. పాట అయిపోగానే కళ్లు తెరచి చూశాను. కన్నీటి తెరలమధ్య కొత్తగా కనిపించాడు నిరంజనం నాకు. కళ్లు తుడుచుకున్నాను. ఇంతకు ముందులా అతన్ని చూడలేకపోయాను. ఇంతసేపూ ఒక స్నేహితుడిగా, సినిమాల గురించి ఆసక్తిగా అడిగే ఒక ప్రేక్షకుడిగా, ఒక మెడికల్ రిప్రజెంటేటివ్‌గా, నా దగ్గర ఫోటోగ్రఫీ గురించి అమాయకంగా అడిగి తెలుసుకుంటున్న సామాన్యుడిగా అతన్ని చూశాను. ఇప్పుడు ఒక గొప్ప కళాకారుణ్ణి, తన కళతో రాతిని సైతం కదిలించగలిగే విద్వాంసుణ్ణి చూస్తున్నాను. కొంతసేపువరకు మాట్లాడలేకపోయాను. నిరంజనం చిరునవ్వుతో చూస్తున్నాడు. ఎలాగో గొంతు పెగల్చుకున్నాను.

''నిరంజనంగారూ! వూహించలేకపోయాను, మీలో యింత ప్రజ్ఞ వుందని. నిజంగా చాలా...''

'ఈ త్యాగరాజ కృతిని మీరు యింతకుముందే వినివుంటారు. సాధారణంగా బాలమురళి కచేరీలలో పాడుతూవుంటారు. ఆ విన్నదాన్నే నేను వాయించటానికి ప్రయత్నించాను.'' అన్నాడు నా మాటల్ని తుంచేస్తూ. అతనికి పొగడ్త యిష్టంలేదని గ్రహించాను. అతనిమీద గౌరవం మరింత ఎక్కువైంది.

''నేనూ విన్నాను బాలమురళి గానాన్ని చాలాసార్లు. కానీ అందులో భక్తికన్నా అతని ప్రతిభే కనిపిస్తుంది నాకు'' అన్నాను.

''అంత మాటనకండి. అతని పాట వింటుంటే మళ్లీ త్యాగరాజే పుట్టాడా అనిపిస్తుంది. అతనిచ్చిన గ్రామఫోను రికార్డునుండే నేను నేర్చుకుని సాధన చేశాను.''

''ఎన్ని చెప్పండి — మీ వాద్యంలో...''

''సర్లెండి. ఇప్పుడు మీ కిష్టమయినది చెప్పండి. ప్రయత్నిస్తాను.'

అతని మనోగతం అర్థమైంది నాకు.

''సైగల్ పాటలు వాయించగలరా? చాలా యిష్టం నాకు. ఏదైనా ఒక విషాద గీతాన్ని వాయిస్తారా?''

''నాక్కూడా చాలా యిష్టం ఆ అమర గాయకుడి విషాద గీతాలు. 'జబ్ దిల్ హి టూట్‌గయా' వాయిస్తాను'' అన్నాడు. ఆ పాటని నేను కొన్ని వందలసార్లు విన్నాను. వింటున్న ప్రతిసారీ నా గుండె బరువెక్కిపోతుంది. నిరంజనం ఏకాగ్రతతో తన ఫిడేలుమీద వాయిస్తూవుంటే, నన్ను నేనే మరచిపోయాను.

సైగల్ పాటల్ని కొంతమంది పేరెన్నికగన్న గాయకులు పాడగా విన్నాను. కానీ ఎవరూకూడా న్యాయం చేయలేదు. సైగల్ పాడేది గొంతుతో కాదు, హృదయంతో. మళ్లీ యీ రోజు ఆ విషాదాన్ని, పాటలోని భారాన్ని నిరంజనం ఫిడేలుమీద వింటున్నాను.

''నిరంజనంగారూ! ముఖస్తుతి అనుకోకండి. నిజం చెప్తున్నాను. మీ వాద్యంలో అమరత్వం వుంది. ఎంతోమంది కళాకారుల కచేరీలని విన్నాను. కానీ యింతగా తన్మయత్వం చెందలేదు. ఫిడేలుమీద మీకున్న ఏకాగ్రత అంత సామాన్యంగా పట్టుబడేది కాదు.'' ఇంకా ఏదైనా అనాలని అనుకున్నానుగానీ సాధ్యం కాలేదు. నిరంజనం నవ్వి వూరుకున్నాడు. నోరు విప్పలేదు. సైగల్ పాడిన 'కరుం క్యా ఆశ్ నిరాశ్ భాయీ', 'సోజా రాజకుమారి' వాయించాడు. అతని కిష్టమైన ఎంకిపాటలు వాయించాడు. అక్కణ్నుంచి వరసగా మీరా భజనలు, త్యాగరాజ కీర్తనలు, దేవులపల్లి గీతాలు వాయించాడు. ఒక్కో పాటకి ఒక్కోరకంగా అనిపించాడు. ఫిడేలు ఒక వస్తువులాకాక అతని శరీరంలో ఒక భాగమే అనిపించింది. నేను మరేం మాట్లాడి అతన్ని నొప్పించదలుచుకోలేదు. కొన్ని గంటలు అలా అతని నైపుణ్యాన్ని ఆస్వాదిస్తూ వుండిపోయాను.

ఫిడేలుని, కమానుని టేబిలుమీద వుంచేసి, మంచంమీద తలగడలు సరిచేసి విశ్రాంతిగా వాలిపోయాడు. పైకప్పు మీదకి దీర్ఘంగా చూసి, నావైపు తిరిగి ఒక నిట్టూర్పు విడిచి మెల్లగా అన్నాడు.

''ఆనందరావుగారూ! మీరు చాలా అదృష్టవంతులు. మీకు ఆనందాన్ని, తృప్తిని యిచ్చే 'కళ'నే మీరు జీవనాధారం చేసుకున్నారు. నావి పూర్తిగా రెండు ప్రపంచాలు. లేని చిరునవ్వుని వృత్తికోసం మోహానికి అంటించుకుని, అవతలి వ్యక్తిని ప్రసన్నం చేసుకోవటానికి మాటల మాలలు అల్లి, మందులు ప్రచారంచేస్తూ, వూరూరా తిరుగుతూ, నలగని బట్టలమధ్య నలిగిపోతూ, మర్యాద నటిస్తూ — ఒక జీవితం. నాకోసం, నా ఆనందంకోసం, నా తృప్తికోసం గంటలతరబడి నా గదిలో ఏకాంతంగా వయొలిన్ వాయించుకుంటూ — యింకొక ప్రపంచం. రెండింటికీ ఎక్కడా పొత్తు కుదరదు. చిన్నప్పట్నుంచీ యీ వయొలిన్ అంటే నాకు చాలా యిష్టం. మా అమ్మ నేర్పించింది. పెద్దయిన తరువాత ఒక గొప్ప విద్వాంసుడి దగ్గర ఇంకా బాగా నేర్చుకోవాలని చాలా కోరికగా వుండేది. మా అమ్మకికూడా. కానీ అవకాశం లేకపోయింది. ఆర్థిక పరిస్థితి! మా అమ్మ తనకున్న ప్రజ్ఞనంతటినీ నాకు ధారపోసింది. తరువాత నా అంతట నేనే సాధన చేసాను. రోజుల తరబడి ఆకలితో గడిపాంగానీ, యీ వయొలిన్‌ని మా అమ్మ అమ్మలేదు ... నన్నాకర్షించిన ప్రతి స్వరాన్ని, రాగాన్ని నా వయొలిన్ తీగెలమీద పలికించేంతవరకూ నాకు నిద్రపట్టేదికాదు. వేరే యితర సరదాలేవీ లేవు నాకు ఇదొక్కటే. నేను వయొలిన్ వాయించగలనని చాలామందికి తెలీదు. ఒక కళని కళగా చూడరు. ప్రదర్శిస్తారు; తమకి కూడా ఒక కళలో ప్రావీణ్యత వుందని. అందుకే నా కిష్టంవుండదు మెప్పుల్లో వుండటం...

ఈ కళారాధనే నన్ను, సాధారణంగా మెడికల్ రిప్రజెంటేటివులకి అలవాటయ్యే తాగుడి నుంచీ, వ్యభిచారం నుంచీ దూరంగా వుంచింది. డబ్బుకోసం, జీతంకోసం ఒక 'హిపోక్రయిట్'లా బతుకుతూ, నష్టపోతున్నదానికి, ప్రతిఫలంగా ఈ సంగీత సాధనలో ఆనందాన్ని పొందుతూ రోజులు గడుపుతున్నాను. సంగీతం, నా మానసిక జీవితానికి ఆలంబన. రోజుకి కనీసం ఒక గంటయినా వాయించకపోతే మనశ్శాంతి వుండదు. హుఁ! కానీ వీలుకుదరదు ... మీరు అదృష్టవంతులు. అభిరుచి, వృత్తి — రెండూ ఒకటిగా వున్న ప్రతి వ్యక్తీ అదృష్టవంతుడే. పదిహేనువందల రూపాయలు తెచ్చుకుంటున్నాను నెలకి. నిజం చెప్పాలంటే నాలాంటి పేదవాడికి యీ ఉద్యోగం దొరకడం అదృష్టమే. ఆనందంగా గడిచిపోయే కుటుంబం నాది. కానీ నాకు తృప్తిలేదు. ఏముంది యీ జీవితంలో? పుట్టినందుకు బతకాలి. బతకాలి కనుక ఏదో ఒకటి చేసి సంపాదించాలి. కానీ ఎందుకసలు జీవితం? అన్న ప్రశ్న వుదయించగానే అసంతృప్తి మొదలవుతుంది. నాకూ, నా కుటుంబానికీ సరిపోయేలా యిప్పుడొస్తున్న జీతంలో కనీసం మూడోవంతు — నేను ఒక కళాకారుడిగా బతికేందుకు దొరికితే యీ ఉద్యోగాన్ని వదిలేయటానికి సిద్ధంగా వున్నాను. తృప్తిగా బతకటం ముఖ్యం. ఈ ప్రచార జీవితం నాకు విసుగ్గా వుంది. యజమానులకి లాభాలు సంపాదించటం కోసం తప్పితే, యీ జీవితానికి మరో అర్థంలేదా?

నా కిష్టమైన జీవితం నాకెందుకు దొరకదు? ఒక్కొక్కసారి యీ బాధని భరించలేక ఏడుస్తూ... మనిషి కోరిన ప్రతీదీ జరగదు ... యీ అసంతృప్తి నా కెప్పటికీ వుండేదే..."

కొన్ని నిముషాలు యిద్దరిమధ్య నిశ్శబ్దం. అతనికి కావలసింది ఓదార్పు కాదని నాకు తెలుసు. విషయాన్ని తప్పించాలనిపించింది.

"ఒక కళాకారుణ్ణి — అతని జీవితం ఎటువంటిదయినా సరే — అతను సాధనచేసి ఆరాధిస్తున్న కళలోనే స్పందింపజేసి, అతని హృదయాన్ని తథాతథంగా తెలుసుకోవచ్చునని 'సోమర్సెట్‌మామ్' ఒక కథలో నిరూపించాడు" అన్నాను.

"నిజమే! ఎప్పుడూ ఎవరితోనూ నేను నా వయొలిన్ గురించి మాట్లాడలేదు. ఇంట్లో అయితే నా భార్య కూర్చుని నాతోపాటే ఆనందిస్తుంది. బతికున్నరోజుల్లో మా అమ్మ వినేది. ప్రోత్సహించేది. నన్ను సరిదిద్దేది. ఇప్పుడు నాకు నేనే విమర్శకుణ్ణి. కానీ యీరోజు ... నన్ను మీరు బాగా కదిలించారు ... చాలా పొద్దుపోయింది. ఇక పడుకోండి..." అన్నాడు, మంచంమీంచి లేస్తూ.

పడుకున్నానేగాని నిరంజనం చుట్టూ అల్లుకున్న ఆలోచనలవల్ల నిద్రపట్టలేదు. అతను—నేను! కళాకారు లిద్దరూవూను. నేను వృత్తి కళాకారుణ్ణి. అతను ఔత్సాహికుడు నా కళ నన్ను పోషిస్తోంది. అతను కళని పోషిస్తున్నాడు. ఆరాధిస్తున్నాడు. మానసిక తృప్తిని మాత్రమే యిస్తుంది అతని కళ అతనికి. నా కళ నాకు డబ్బులుకూడా యిస్తోంది. కానీ తృప్తినిస్తోందా? నా కళాజగత్తు ఒక మిథ్యాప్రపంచం — నటన! ఆతనిది ఏకాంతంలో నిజమైనది ... కళ గురించి అతనిలో సంఘర్షణ వుంది. తపన వుంది. అదేమిటో తెలియక సతమతమవుతున్నాడు అశాంతితో బాధపడుతున్నాడు ... ఏకాగ్రతలో, నిశ్చలతతో తనకి తానై అభ్యసించి కైవసం చేసుకున్న కళాప్రజ్ఞ కేవలం తన ఆనందం కోసమేనా? వేరే ధ్యేయం లేదా? ... అతనికి మనశ్శాంతి కావాలి ... ఎలా? ... తన కళని తను వృత్తిగా స్వీకరించలేకపోయాననే బాధ అతనిలోంచి పోవాలి ... ఎలా? ... ఏం చేస్తే అతను నిత్య నూతనోత్సాహంతో, తన కళారాధనలో యింకా లీనమౌతాడు? ... ఏం చేయాలి? ... ఒక నిర్ణయానికొచ్చాను ... మగతగా నిద్రపట్టింది.

మర్నాడుదయం అతనితో కలిసి ఫలహారంచేసి, మళ్లీ సాయంత్రమే వస్తానని, గదిలోనే వుండమని, ఎక్కడికీ వెళ్లొద్దని మరీ మరీ చెప్పి మాట తీసుకుని వచ్చేశాను.

సాయంత్రం అయిదు గంటలకే ఉత్సాహంగా నిరంజనం గదిని చేరుకున్నాను. బలవంతంపెట్టి, అతన్ని, ఫిడేలు పెట్టెతోసహా లాక్కుపోయాను; మా ప్రొడ్యూసర్‌గారింటికి. అక్కడ మా ప్రొడ్యూసరుగారినీ, డైరెక్టరుగారిని, సంగీత దర్శకుణ్ణి పరిచయం చేశాను. కొత్తగా, వింతగా చూశాడు నిరంజనం. అందరం కూర్చున్నాం. నిరంజనం మొహమాట పడుతున్నట్టుగా కనిపించాడు ధైర్యం చెప్పి తన కళా నైపుణ్యాన్ని ప్రదర్శించమన్నాను. డైరెక్టరుగారుకూడా హుషారిచ్చారు నిరంజనం కొద్దిసేపట్లోనే సర్దుకుని ఫిడేలుమీద తన నైపుణ్యాన్ని క్రమక్రమంగా ప్రదర్శించాడు. మా ప్రొడ్యూసరుగారు అతనివైపు తృప్తిగా చూడటం గమనించాను. మా సంగీత దర్శకులు సుబ్బారావుగారు తన కిష్టమైన రాగాల పేర్లు చెప్పి వాయించమన్నారు త్యాగరాజ కృతిని మళ్లీ వాయించమన్నారు. చాలా సేపు జరిగింది నిరంజనం ఫిడేలు కచేరీ.

బాగా పొద్దుపోయింతర్వాత, నిరంజనం గదికి చేరుకున్నాం. అలసటగా కుర్చీలో కూర్చుండిపోయాను. అతని మొహంలో ఒక రకమైన నిండుదనాన్ని చూడగలిగాను.

'నిరంజనంగారూ! ఇక మనిద్దరి స్నేహం రోజు రోజుకీ అభివృద్ధి చెందుతుంది. ఇక మీరు నాతోనే వుంటారు" అన్నాను అతని కళ్లల్లోకి చూస్తూ.

'ఇప్పటికే మీరు నాకు మంచి స్నేహితులు. కానీ ఆనందరావుగారూ, నిజం చెప్పొద్దూ, అంత పెద్దవారి ఎదుట వాయించటానికి సిగ్గు వేసింది."

"నేను అనుకున్నదానికంటే ఎక్కువగానే వాళ్లందరూ మిమ్మల్ని మెచ్చుకున్నారు. ఇక అసలు విషయం చెప్పేస్తున్నాను. ఇకనుంచీ మీరుకూడా సినిమావాళ్లయిపోతున్నారు."

"అంటే...!?" — ఆశ్చర్యంగా అడిగాడు నావైపు కొంచెం ముందుకి వంగి.

"మేం తీయబోయే సినిమాలో 'హీరో' వయొలిన్ వాయిస్తూంటాడు. నేపథ్యంలో మీరు వాయిస్తారన్నమాట. అదిగాక మా సుబ్బారావుగారు మిమ్మల్ని తమ 'ఆర్కెస్ట్రా'లో చేర్చుకుంటానన్నారు." అన్నాను తాపీగా; అతని వదనంలో మెరవబోయే ఆనందాన్ని అంచనా వేస్తూ.

"వ్వాట్!" కేక వేసినంత పని చేశాడు.

"అవును. మీలో గొప్ప సృజనాత్మక శక్తి వుందనీ, వయొలిన్ వాయించటంలో మీకు చాలా ప్రావీణ్యం వుందనీ, మిమ్మల్ని తన జట్టులోకి ఆనందంగా తీసుకుంటానని అన్నారు. గొప్ప సంగీత దర్శకుడాయన. ఒకంతట ఎప్పుడూ ఏ కళాకారుణ్ణీ మెచ్చుకోనివాడు. మిమ్మల్ని ఒకటే పొగుడుతున్నాడు. నిరంజనంగారూ! ఒక మంచి కళాకారుణ్ణి కళాజగత్తుకి పరిచయం చేస్తున్నందుకు నాకు గర్వంగా వుంది" అన్నాను.



"మీరు నిజంవే చెబుతున్నారా ఆనందరావు గారూ !" ఇంకా నమ్మలేకపోతున్నాడు మానవుడు.

"అవును. ఇప్పుడు మీకు నెలకి ఆరువంద ఇస్తారు. మీరు కృషి చేస్తే మిమ్మల్ని తప్పకుండా తనకి సహాయకుడిగా తీసుకుంటారు సుబ్బారావుగారు. నాకా నమ్మకం వుంది. ఈ కళా ప్రపంచంలో మీ పేరు మారుమోగుతుంది. మీరు కోరుకున్న జీవితం మీకు లభిస్తోంది... రేపు వుదయం పది గంటలకి వస్తాను. సుబ్బారావుగారి ఆఫీసుకి వెళ్దాం. అక్కడే అన్నీ మాట్లాడుకుందాం. మీరెప్పుడు చేరేదీ, మీరేం చెయ్యాలీ, అన్నీను. ముందు మీరీ మందుల బంధంనుండి బయటపడాలిగా" అన్నాను.

నిరంజనం ఏమీ చెప్పలేకపోయాడు. చెప్పలేదు. అతని భుజంమీద స్నేహపూర్వకంగా తట్టి, వుండి పొమ్మని బలవంతం చేస్తున్నా, అతని ఆలోచనలకి అంతరాయం వుండకూడదని, కావాలనే వచ్చేశాను.

మర్నాడుదయం పది గంటలకే వెళ్ళాను. అతని గదికి తాళం వేసివుంది. కిందని వున్న 'లాడ్జింగ్ మేనేజరు' దగ్గరకి వెళ్లి వాకబు చేశాను. అతను, నేనే ఆనందరావునని తెలుసుకుని, నిరంజనం నా కిమ్మన్నాడని ఒక కవరిచ్చాడు. కవరు చించి వుత్తరాన్ని బయటికి తీసి చదువుకున్నాను.

ఆనందరావుగారూ !

నన్ను క్షమించండి.

నిన్న రాత్రంతా బాగా ఆలోచించాను. మీ మంచితనానికీ, స్నేహానికీ ముగ్ధుణ్ణవుతున్నాను. మీ రుణం నేను ఎప్పటికీ తీర్చుకోలేనేమో !

నాకు యిష్టంలేని జీవితం — నా వుద్యోగం. అందులోంచి పారిపోలేక, మానసిక విశ్రాంతికోసం సంగీతాన్ని ఆరాధించాను. ప్రతిఫలం ఆశించలేదు. కనుక ఆ విద్య నన్ను అంతగా ఆవహించిందేమో.

పూర్తిగా వ్యాపార దృక్పథం వున్న వృత్తి జీవితం నుండి అంత సులభంగా బయటపడలేనేమో ననిపిస్తోంది. నా కుటుంబ సభ్యులు కూడా అంగీకరించరు. ఇప్పుడున్న జీవితానికి సంఘంలో గౌరవం వుంది. మర్యాద వుంది. నా ఆధారంగా నా కుటుంబానికి ఒక మనుగడ వుంది. సాఫీగా సాగిపోతూవుంది. ఒక్కసారిగా నేను వాటన్నిటినించీ బయటపడగలనా ? నా భార్యా పిల్లలు హర్షిస్తారా?

పైగా యీ కళని వృత్తిగా స్వీకరిస్తే నేను విజయం సాధించలేననిపిస్తోంది. ఒక అందంవైన అందని వస్తువుగానే అది నాకు నిత్యాకర్షణగా వుంటుందేమో ! అసలు యివేవీకాదు. ఇంకేదో కారణం, నాకే అస్పష్టంగా వుందది. ఇదంతా నిన్న రాత్రే నేను గ్రహించాను.

నాలోని యీ నైపుణ్యం, నా ఏకాంత జీవితంగానే వుండిపోనివ్వండి. అలవాటుపడిన దారిలోనే యీ బతుకుని సాగిపోనివ్వండి.

మా 'రిప్రజెంటేటివు'ల 'మెస్'కి మారిపోతున్నాను.

ఇకనుంచీ నా కళతో నా చేతనయినంతవరకూ, నా చుట్టూ వున్నవారిని ఆనందింపజేయటానికి నిర్ణయించుకున్నాను. అలా ఒక సార్థకతని సాధిస్తాను.

మీ సహాయాన్ని అందుకోలేకపోతున్నందుకు నన్ను క్షమించండి.

నమస్కారం.
మీ
"నిరంజనం."

ఉత్తరాన్ని పూర్తిచేసి నవ్వుకున్నాను; నేను ఊహించినట్టే జరిగినందుకు. ఇక నిరంజనంలో అశాంతి, అసంతృప్తి వుండవు.

స్నేహ ధర్మాన్ని నిర్వర్తించినంత గర్వంగా హోటల్నుండి బయటపడ్డాను.

ఈ కథని తమ సునిశిత విమర్శతో, సూచనలతో సరిదిద్ది, కావలసిన సంగీత పరిజ్ఞానాన్ని ప్రసాదించిన వికాసం అధ్యక్షులు డా. వుప్పల లక్ష్మణరావుగారికి కృతజ్ఞతాభివందనాలు. —రచయిత



# ఎవరెడి జీవన్-సాథీ

ఇత్తడి టార్చ్

యుగ యుగం వెలిగేది యుగ యుగం మన్నేది




EVEREADY ఎవరెడి-మీకు ఎప్పుడైనా కావలసినది ఆహామీ మాత్రమే

CBM-50/2B/TEL



# చినుకుల చిటపటలు




గొడుగు బాగు చేయించుకోవాలి. ఓ పావలా ధర్మం చెయ్యండి బాబూ!






ఔను! వాడికేం తక్కువ! వాళ్ళమ్మ రాసిన కథలు రోజుకి రెండేసి తిరిగొస్తాయట!


జనతా గొడుగులు



అమ్మో,
వాళ్ళ
బాత్‌రూమునుండి
అంత చెడ్డ
వాసన వస్తుందేం,
మనదాంట్లో మంచి
వాసనేస్తుండగా?

మనం
ఓడోనిల్
వాడతాముగామరి!




ఓడోనిల్—భరించలేని దుర్వాసనలను వెంటనే దూరం చేసి, మీ మరుగుదొడ్డిని తాజా సువాసనలతో రూపొందిస్తుంది.

ఓడోనిల్—ఎన్నో సువాసనలలో, రకరకాల సైజులలో, ప్యాకింగులలో దొరుకుతుంది.

ఓడోనిల్, కలరా ఉండలకన్న 30 రెట్లు అధిక శక్తి గలది, అత్యంత అమోఘమైనది. మీ ఇంట్లోని బట్టల బీరువాలలో పురుగుల బాధ లేకుండా ఉండేందుకు కూడా దీనిని వాడండి.

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు
BALSARA బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
49, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, ఫోర్ట్, బొంబాయి–400 023.

CHAITRA-BLS-163 TEL




*(గత సంచిక తరువాయి)*

గోడవైపు తల తిప్పుకుని మంచం మీద బోర్లా పడుకుని వుంది కస్తూరి. ముందు గదిలోంచి తండ్రి కోపంగానూ, తల్లి బాధగానూ, అన్నయ్య చీదరించుకుంటున్నట్లుగానూ అంటున్న మాటలు స్పష్టంగా వినిపిస్తూనే వున్నాయి. అసలు తనకు వినిపించాలనేదే వాళ్ళ వుద్దేశ్యం కూడా.

"అసలేవిటే దీని ధోరణి నాకర్థంకాదూ? ఆఁ?! నిక్షేపంలాంటి సంబంధం వస్తే — వా కొద్దంటుందేవిటి!! ఇదేనమో సిరిరా మోకాలడ్డడవంటే! ... చ్ఛ్చ్ఛ్. తల క్రిందులుగా తపస్సు చేసినా ఇలాంటి సంబంధం మళ్ళీ వస్తుందా?" — తండ్రి గావు కేకలు.

"ఏమో బాబూ, వింత వాలకం యిదీనూ! అసలు వద్దనడానికైనా కారణమేమిటో అర్థం కావట్లేదు నాకు. కారణమేమిటో కనుక్కోండి ముందు అసలు పెళ్ళంటూ చేసుకోదల్చుకుందో లేదో ముందది కనుక్కోండి" అయోమయంగానూ, సణుగుతున్నట్లుగనూ తల్లి తన బాధని వ్యక్తం చేస్తోంది.

## గొలుసు కథ

"అదేంకాదులే అసలు. ఈవిడగారి క్వాలిఫికేషన్స్‌కి తూగింది కాదు కాబోలు ఈ సంబంధం. అదీ సంగతి. ఏ మహారాజో ఈవిడగార్ని వెతుక్కుంటూ వచ్చి, ప్రాధేయపడి పెళ్ళి చేసుకుంటాడని కలలు. అందుకనే 'ఆడదానికి ఎందుకొచ్చిన చదువులూ, సుబ్బరంగా ఇంటి పని నేర్పించండి, ఫస్టుక్లాస యిన సంబంధం నేను తెచ్చి చేస్తాను దీని పెళ్ళి' అని ఆనాడే నేనెంత మొత్తుకున్నా విన్నారుకాదు మీరు ఈనాడు దానికి నెత్తి మీద కొమ్ములొచ్చాయి" — అంటూ చీదరించుకుంటున్నాడు అన్నయ్య.

కస్తూరి దృష్టి తిన్నగా నిలిపి, అన్ని మాటలూ వింటూ, చలనం లేకుండా అలాగే పడుకుని వుంది. మెదడంతా బరువుగా వుంది. ఆలోచన్ను కూడా గజిబిజిగా వు తను తీసుకుంటున్న నిర్ణయం సరైనదో కాదో తేల్చుకునే పరిస్థితిలో లేదు

'అమ్మాయ్ ..."

ఉలిక్కి పడింది కస్తూరి.

నెమ్మదిగా వెనక్కి చూసి, లేచి కూర్చుంది.

గదిలో లైటు వెలిగింది. గదంతా వెలుతురొచ్చినా, మనసంతా మరింత మసక బారినట్లు ఫీలయ్యింది కస్తూరి.

"అమ్మాయ్ - నువ్వు ఇలా ఎందు కంటున్నావో మా కెవ్వరికీ అర్థం కావట్లేదు. ఇది బంగారంలాంటి సంబంధమని మా అందరి అభిప్రాయం. నువ్వనేదేవిటీ... ఈ సంబంధం యిష్టంలేదనా—లేక అసలు పెళ్ళే ..." రాజీ ధోరణిలో ఇంకా ఏదో అడగబోతున్న తండ్రి మాటల్ని మధ్యలోనే త్రుంచేసింది కస్తూరి.

"నాన్నా! నా మనసేం బావులేదిప్పుడు. నన్ను ఒంటరిగా వదిలేస్తే చాలా సంతోషిస్తాను. అన్నీ వివరంగా ప్రొద్దున్నే మాట్లాడుదాం, నాకు ఆలోచించుకోవడానికి టైము

# ఇంటికి ఒక ప్రెస్టీజ్‌ని తీసుకువెళ్ళండి

## Prestige

### – దాని ధరలో ¼ ధరకే



లక్ష్మీవిలాస్ బ్యాంక్ లిమిటెడ్ మిగిలిన మొత్తం 8 నెలల కాలంలో 6 వాయిదాలలో చెల్లించడానికి మీకు సహాయం చేస్తుంది.

LVB

**60%** పైగా ఇంధనం పొదుపు చేస్తుంది కనక మీ ప్రెస్టీజ్ దరిదాపు వాయిదాలన్నీ చెల్లిస్తుంది.

తమిళనాడు, పాండిచేరి, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక మరియు కేరళలలో లక్ష్మీవిలాస్ బ్యాంక్ లిమిటెడ్ బ్రాంచిలు వున్నచోట్ల ప్రస్తుతం వర్తిస్తుంది.

పూర్తి వివరాలకి మీ ప్రెస్టీజ్ డీలర్ వద్దకు ఇప్పుడే వెళ్ళండి.

ప్రెస్టీజ్‌తో వదలండి — ప్రెషర్ కుకింగ్‌లో అగ్రస్థానంలో వున్నది.

టి.టి. (ప్రైవేట్) లిమిటెడ్, బెంగుళూర్ 560 016

కొనండి Prestige జీవితం సుఖమయం చేసుకోండి

SAA/TTP/2631/TEL




ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు

# జయశ్రీ గ్రూప్‌లో

## సభ్యులుగా చేరండి ఉచితంగా!



మొదటి నెలలో రు. 26 చెల్లించి సభ్యులుగాచేరి వెంటనే
జిప్ హేండ్ బేగ్ పొందండి!

క్రమము తప్పకుండా ప్రతీ నెల రు. 21 చొ॥న 20 మాసములు చెల్లించాలి!

6వనెలలో జిప్ ఎయిర్ బేగ్. 11వ నెలలో జిప్ డాక్యుమెంటు ఫైలు.
16వ నెలలో బ్రీఫ్‌కేస్, 21వ నెలలో పోకెట్ ట్రాన్సిస్టర్ మరియు
'60 మాసముల డ్రాలలో 18,195 బహుమతుల విలువ రు. 3,63,000.

61వ మాసములలో ప్రతీ సభ్యునికి 4½ x 2½ సైజుల స్టీల్
బీరువా లేక సోఫా కంబెడ్ లేదా 26వ నెలలోనే పొందే
అవకాశంకూడా కలదు!

అదా చేయండి! ఆదాయం పొందండి!

పూర్తి వివరములకు

**ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు**

(గవర్నమెంటు రిజిష్టర్డు నెం. 2370)

పోస్టుబాక్సు నెం. 47 రాజమండ్రి-533101
ఫోన్: 1411 గ్రామ్సు: సేవింగ్

జయశ్రీపై
లేక కమీషనుపై
ప్రతినిధులు,
డెవలప్‌మెంటు
ఆఫీసర్లు
కావలెను

ఆంధ్రప్రదేశ్ అంతటా బ్రాంచీలు, ఏజన్సీ ఆఫీసులు కలవు

కావాలి.'' అంది కస్తూరి తీవ్రంగా-'తెల్లారే దాకా ఇంట్లో ఎవ్వరూ ఇంక ఈ విషయం ప్రస్తావించొద్దు' అన్న ధోరణిలో.

ఇంకో రెండు క్షణాలవరకూ జానకి రామయ్యగారు అక్కడే నిల్చున్నారుగానీ, ఆమెనీ ఆలోచించుకోనివ్వడమే సబబని భావించి, అసంతృప్తితోనే బయటకు వెళ్ళిపోయేరు.

బయట గుసగుసలు ఓ రెండు నిమిషాల పాటు జరిగి, ఆగిపోయేయి.

మంచంమీద కూర్చుంటూ బరువుగా నిట్టూర్చింది కస్తూరి.

రెండు వేళ్లతో కణతలమీద బలంగా రుద్దుకుంది. నెమ్మదిగా తలెత్తి, చుట్టూ చూస్తూ, కిటికీ పక్కగా గోడకి తగిలించిన గ్రూపు ఫోటోమీద దృష్టి నిలిపింది. కొద్ది క్షణాలు అలాగే చూస్తూండిపోయి, నెమ్మదిగా లేచి, ఆ ఫోటోని చేతిలోకి తీసుకుంది.

ఆ ఫొటోలోని అందరూ తమబంధువులే! ఆ ఫోటో తీసినప్పటికి తను బాగా చిన్నపిల్ల. పెద్దవాళ్ళ కాళ్లదగ్గర కూర్చునుంది. తన వెనక చిదంబరం బాబాయి కుర్చీలో వున్నాడు సూట్లో వున్నాడు. మీసాలు, పెద్ద పెద్ద బుగ్గలు, ఎవరైనా బెదరకొట్టేట్టుగా వున్నాడు. ఆ వెనగ్గా...

ఆ వెనకగా మెడచుట్టూ పమిట త్రిప్పుకుని, భీత హరిణేక్షణలా చూస్తూ, ముడుచుకుపోయి నిల్చున్న ముగ్ధ మనోహర రూపవతి పిన్నిని చూస్తూనే కస్తూరి కళ్ళు చెమ్మగిల్లాయి. క్షణకాలంలో రెండు కన్నీటి బొట్లు టపటప ఆ పటంమీద రాలాయి.

పమిటతో కళ్ళు వత్తుకుని, లేచి, ఫోటో గోడకి తగిలించి, చాప, దుప్పటి, తలగడ తీసుకుని డాబామీదకి వెళ్ళింది కస్తూరి.

"ఈ రోజు నా జీవితంలో చాలా ముఖ్యమైనది. ఈ రోజు నేను తీసుకోబోయే నిర్ణయంమీదే నా భవిష్యత్తు అంతా ఆధారపడి వుంటుంది. కాబట్టి గత జీవితం నేర్పిన పాఠాల్ని నెమరు వేసుకుంటూ, అనుభవాలు ఆసరాగా ఏర్పరుచుకున్న ఆశయాల సాధనకు పునాదులు వేసుకోవాలి'' అనుకుంది — డాబా మీద చాప పరచి, వెల్లకితలా వాలి, కళ్ళు మూసుకుంటూ.

* * *

రెండు గంటలపాటు స్కూల్లో ఆడుకుని,



గేటు బయట కొచ్చిన ఎనిమిదేళ్ల కస్తూరి కుడివైపుగా ఇంటికి వెళ్ళాలో, ఎడమవైపుగా పిన్ని ఇంటికి వెళ్ళాలా అని ఒక రెండు నిమిషాలు సందిగ్ధంలో పడింది. చివరకు పిన్ని ఇంటికే వెళ్ళాలని నిశ్చయించుకుని ఎడమవైపు తిరిగి బయల్దేరింది.

అప్పటికి మూడ్పావు గంట నుంచీ గుమ్మం మెట్లమీద వీధివైపు యెదురు చూస్తూ కూర్చుని వుంది మహాలక్ష్మి. ఆమెకు చాలా విసుగ్గా వుంది. ఒక విధమైన చిరాకు, ఉడుకుమోతు తనం ఆమె మనస్సుని రెచ్చగొడుతున్నాయి. కట్టుకున్న కొత్తచీర, పెట్టుకున్న నగలు, తల్లో పూలు, అన్నీకూడా తనని వెక్కిరిస్తున్నట్టుగా వుంది. తమ వీధిలోని ప్రతిజంట తనని ఏడిపించడానికని మరీ అంటుకు నడుస్తూ, లేని ఆనందం కనబరుస్తున్నట్టుగా వుంది. తను ఈ జగత్తులో ఒంటరి దానిననీ, తనని ప్రేమించే వాళ్ళుగానీ, తను బాధలో వున్నప్పుడు ఓదార్చే వాళ్ళుగానీ లేనట్లుగా నూ అనిపిస్తోంది ఆమెకు ఆ ఒంటరి తనంలో.

"పిన్నీ..."

—ఉలిక్కిపడింది మహాలక్ష్మి. ఆమెకళ్ళు ఆనందంతో మెరిసాయి. మల్లెచెండు లాంటి నవ్వొకటి ఆమె పెదవులపై విరిసింది. గేటుదగ్గర నవ్వుతూ నిలబడ్డ కస్తూరిని చేతులు చాచి ఆహ్వానించింది.

"దామ్మా అమ్మడూ. స్కూల్నుంచే యిటు వచ్చేస్తున్నావా ఏవిటే పుస్తకాల సంచీకూడా తెచ్చావు? ఏం, అమ్మావాళ్ళు ఎక్కడైనా వెళ్ళారా?'' అంది కస్తూరిని దగ్గరకు తీసుకుంటూ.

కస్తూరి మాట్లాడకుండా బుంగమూతి పెట్టింది.

మహాలక్ష్మి బుజ్జగిస్తూ తన ప్రశ్నని రెట్టించింది.

"మరేమోనేం- పొద్దున్న అమ్మ నామీద కోప్పడింది. ఇంటికి పోకుండా ఇక్కడకొచ్చా'' చెప్పడానికి ముందు సంశయించినా, చెప్పింది కస్తూరి.

—ఆశ్చర్యపోయింది మహాలక్ష్మి.

"ఛఛఛ-తప్పుకదూ! అమ్మ కోప్పడినంత మాత్రాన ఇలా చెప్పకుండా వచ్చేస్తారా? అమ్మా వాళ్ళు కంగారు పడరూ? ఊఁ? పద మీ ఇంటికి వెళ్ళి, వాళ్ళకోసారి కనిపించి మళ్ళీ వద్దాం. ఏం?'' అంటూ మళ్ళీ వీధివైపొకసారి దృష్టి సారించి, బరువుగా నిట్టూర్చి, లేచి నిల్చుంది మహాలక్ష్మి. అంతలోనే - భర్త వచ్చిన సమయానికి తను ఇంటివద్ద లేకపోతే తర్వాత వుండే పరిస్థితి వూహించుకుని, ఆలోచనలో పడింది. కాని - స్కూలువదిలి రెండు గంటలు పైగా అయినా పిల్ల ఇంటికి రాకపోయేసరికి అక్కగారింట్లో ఎంత కంగారు పడుతుంటారో తలుచుకుంటే ఆందోళన కలిగింది. చివరికి ఒక నిశ్చయానికి వచ్చి, లోపలకి వెళ్ళి, భర్తకి ఓ చిన్న చీటీ వ్రాసి, బల్లమీద పెట్టి, ఇంటికి తాళం వేసి, తాళంచెవి ప్రక్కింటివాళ్లకిచ్చి,



## కస్తూరి

కస్తూరిని తీసుకుని గబగబా బయల్దేరింది మహాలక్ష్మి.

చెల్లెల్నుంచి విషయంవిన్న సుభద్రమ్మ గారు చాలా బాధ పడింది. కస్తూరిని దగ్గరకు తీసుకుని – ముద్దెట్టుకుని, ఇంకెప్పుడూ అంతలా కోప్పడనని హామీ యిచ్చింది.

"పిన్నీ! మేమంతా ఇప్పుడు పార్కుకి వెళ్దాం అనుకుంటున్నాం. బాబాయి యింకా ఆఫీసునుంచి రాలేదంటున్నావు కదా – నువ్వు కూడా రాకూడదూ?" అన్నాడు శేఖర్.

"లేదురా నానీ. నేను రాలేను. ఒక వేళ ఆయన వచ్చినా రావచ్చు ఇంటికి. తొందరగా రమ్మని చెప్పానుకూడా. ఎందుకో ఆలస్యమై వుంటుంది. మీరంతా వెళ్ళండి" అంది మహాలక్ష్మి ఇంటికి వెళ్లడానికి సిద్ధపడుతూ.

"అదికాదు పిన్నీ. పార్కులో 'ఫలపుష్ప ప్రదర్శనం' ఓ నాలుగు రోజులపాటు స్పెషల్‌గా ఏర్పాటు చేశారు. ఈవాళ ఆఖరు రోజు. రా పిన్నీ చాలా బావుంటుందీ..."

"అవును పిన్నీ, నువ్వుకూడా రాపిన్నీ..." అంటూ గారం చేసింది కస్తూరి.

"అవునే లక్ష్మి! నువ్వుకూడా రా. దగ్గరే కదా. ఓ అరగంటలో ఆయిపోతుంది. సరదాగా వెళ్దాం" అంది సుభద్రమ్మ.

"అదికాదు అక్కా! ఆయన్ని త్వరగా రమ్మనమని చెప్పివచ్చాన్ని నేనే ఇంటిదగ్గర లేకపోతే ఆయన ఏమనుకుంటారు? అందుకని."

"ఏమిటే పెద్ద – నువ్వొక్కత్తివే కాపురం చేస్తున్నట్టు మాట్లాడతావ్? ఆఫీసులో పనుండి పోయిందో ఏమిటో – అతగాడెలాగూ త్వరగా రాలేదుగా ఇంటికి. నాకు తెలీదూ చిదంబరం ఎలాంటి వాడో. అంతగా అయితే నేనొచ్చి చెబ్తాలే అతనో. సరా?" అంది సుభద్రమ్మ చెల్లెల్ని మెత్తగా కోప్పడుతూ.

కాదనలేకపోయింది మహాలక్ష్మి.

పార్కులో వున్నంతసేపూ మనస్సంతా ఇంటిమీదే వుంది.

* *

పడకుర్చీలో తల పైకెత్తి పడుకుని, నిదానంగా పైకప్పుకేసే చూస్తూ, వేడెక్కిన మెదడుని సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చి మరింత వేడెక్కిస్తూన్న చిదంబరం – తలుపు కొట్టుతూన్న చప్పుడు అయిదు నిమిషాల్నుంచీ వింటూనే వున్నాడు. మధ్య మధ్య "ఏమండీ" అన్న పిలుపుకూడా అతని చెవులకి వినిపిస్తూనే వుంది.

సిగరెట్టు పెట్టెలోకి వ్రేళ్ళు పోనిచ్చి, సిగరెట్లు అయిపోయినట్లు గమనించాడు. విసురుగా దాన్ని నేలకేసి కొట్టాడు. కాళ్ళక్రింద – కదలక మెదలక వున్న స్టూలుని బలంగా ఒక తన్ను తన్నాడు.

మళ్ళీ తలుపుమీద చప్పుడయ్యింది.

పళ్ళు కొరుకుతూ ఒక్క వుదుటున పైకి లేచాడు చిదంబరం. అలా విసురుగా లేవడంలో కుర్చీగుడ్డ కుట్లుతెగి, లోపలికి పడిపోబోయి, నిలదొక్కుకుని లేచాడు. కోపంగా కుర్చీగుడ్డనికూడా ఒక తన్ను తన్నాడు. 'పర్రు' మని చిరిగిపోయింది అది.

తలుపు చప్పుడెక్కువైంది, రెండుసార్లు "ఏమండీ" అన్న పిలుపు సాయంతో.

ఒక్క దూకులో తలుపు దగ్గరకెళ్ళి, తలుపు తీస్తూనే మహాలక్ష్మిని లోపలకి లాగి, చాచి లెంపకాయ కొట్టాడు. "నాకేం చెవుడనుకున్నావా అన్నిసార్లు తలుపులు బాదుతున్నావ్" అని గర్జించాడు.

తల తిరిగి పోయింది మహాలక్ష్మికి. దవడ మీద అయిదువేళ్ళు అంటుకుపోయి, దెబ్బ పడ్డచోటునుంచి ఆవిర్లొస్తున్నాయి. కళ్ళమ్మట నీళ్ళు చిమ్మాయి. భర్త మొహంలోకి భయంగా చూసి, గదినంతా పరికించి చూసి, ఆశ్చర్యపోయింది. మరింత భయపడిపోయింది.

పిన్నిమీద దెబ్బ పడుతూనే ఏడుపు మొదలు పెట్టింది కస్తూరి. కళ్ళు గట్టిగా మూసుకుని, పిన్నిని కౌగలించుకుని బావురుమంది.

భార్య వెనక కస్తూరికూడా వుందని వూహించని చిదంబరం కొంచెం కంగారు పడ్డాడు. ఓ క్షణంలో తమాయించుకుని, తనలోని కంగారు బయటకు కనబడనీయకుండా జాగ్రత్తపడ్డాడు. తన మగతనం, ఆధిక్యం చూపించుకోవడానికి ఆపిల్ల ఉనికి ఒక అడ్డంకి కాదని సర్ది చెప్పుకున్నాడు.

"నీకిష్టమొచ్చినంతసేపు నువ్వు ఊరంతా తిరిగొస్తే – నువ్వొచ్చేక నీపరదాలు తీర్చడానికీ, సినిమాకి షికార్లకీ తిప్పడానికీ నేను ఇంటి దగ్గర కుక్కలా పడివుండాలనేదే కదూ నీ అభిప్రాయం?" – కసిగా చూస్తూ అడిగాడు భార్యని.

దుఃఖంతో గొంతు పూడుకుపోయి, మాట

బయటకు రాలేదు మహలక్ష్మికి.

"చెప్పు. ఆఁ?... 'సినిమాకి తగలడదాం త్వరగా రండి ఆఫీసు నుంచి' అని చెప్పినా నివి, నే నొచ్చేవరకూ ఇంటి దగ్గరుండాలనే ఇంగిత జ్ఞానం లేదు నీకూ?... మాట్లాడు లేకపోతే చంపేస్తా" అంటూ ఆమె రెండు జబ్బలూ పుచ్చుకుని వూపేస్తూ అడిగాడు చిదంబరం.

"అందుకనే... చీటీ..."

"ఆఁ చీటీ... చీటీ రాసి పెట్టావా? ఏం రాశావు ఆ చీటీలో?– పది నిముషాల్లో వస్తానని రాసిన్దానివి గంటకా రావడం?"

"అక్కావాళ్ళూ పార్కుకివెళ్తూంటే.." సూటిగా చూడలేక కళ్ళు దించుకునే అంది మహలక్ష్మి.

# కస్తూరి

పళ్ళు పటపట కొరికాడు చిదంబరం.

"ఓహో అదా సంగతి! అలా చెప్పు. సినిమాకి తీసుకెళ్తానని చెప్పిన ఈ వెధవ ఇంకా రాలేమా, వీడిమొహం వీడేం తీసుకెళ్ళగలడులే, కనీసం పుట్టినరోజునాడయినా ఊళ్ళో అందరికీ సింగారించుకు కనిపించకపోతే యెలాగా? అని పార్కుకి వెళ్ళా వన్నమాట."

"ఏమిటండీ ఆ మాటలు? మీరంటే నా కెప్పుడూ అటువంటి భావం..."

"నోర్ముయ్. పతివ్రత కబురు చెప్తే నరికి పోగులెడతా. స్టుపిడ్. అసలు నీలాంటి చదువురాని మొద్దుని పెళ్ళాడినందుకు నువ్వు వెయ్యి జన్మలెత్తినా నా రుణం తీర్చుకోలేవు తెల్సా? ఈసారి నాకు తెలియకుండా ఇల్లు కదిలావంటే... ఆ రోజుతో నీ ఆయుష్షు తీరిపోయిందన్నమాటే. పిచ్చి పిచ్చి వేషాలెయ్యక ఇంట్లో పడుండు" అని, చెప్పులేసుకుని, చరచర వీధిలోకి వెళ్ళిపోయేడు చిదంబరం.

చిదంబరం బయటకు వెళ్ళగానే, లోపల్నుంచి లావాలాగ ఉబికి వస్తున్న కన్నీటిని ఆపుకోలేక మంచంమీద వాలిపోయి తలగడలో మొహం దాచుకుని బావురుమంది మహాలక్ష్మి; తన పుట్టినరోజు ఎంతో ఆనందంగా జరగాలనుకుంది. కానీ ఇలా...

తన చెయ్యిమీద చెయ్యి పడేసరికి ఉలిక్కిపడింది మహాలక్ష్మి. తల ప్రక్కకి తిప్పి, కన్నీటి పొరల మధ్యగా చూసింది. భయంతో బిక్కచచ్చిపోయి, ఏడవడానిక్కూడా ధైర్యం చాలక నిల్చున్న కస్తూరిని చూస్తూనే లేచి కూర్చుంది మహాలక్ష్మి. కొంగుతో మొహం గబగబా తుడుచుకుని, కస్తూరిని ఒడిలోకి తీసుకుంది. ఏడవబోతున్న కస్తూరిని నవ్వించడానికి వీలయినంతగా ప్రయత్నించింది, బుజ్జగించింది. గబగబా వంటింటిలోకి తీసుకుపోయి, ఆ రోజు చేసిన స్వీటు పెట్టింది. కస్తూరి పెట్టిన కండిషన్‌కి వప్పుకుని తను కూడా కొంచెం తింది.

"పిన్నీ! నువ్వేం తప్పు పని చెయ్యలేదుగా మరి బాబయ్యెందుకు కొట్టారు నిన్ను?" స్వీటు నోట్లో పెట్టుకోబోయి, ఆగి అంది కస్తూరి.

మాన్పడి పోయింది మహాలక్ష్మి. ఏం జవాబు చెప్పడానికీ తోచలేదు.

"అది తరువాత మాట్లాడుకుందాం గానీ — స్వీటు ఎలావుంది చెప్పు?"

"ఊహూ — ముందు నేను అడిగిన దానికి జవాబు చెప్తేనే స్వీటు ఎలావుందో చెప్తా. లేకపోతే అసలు తిననే తినను."

"అలా మంకుపట్టు పట్టకూడదు. తినమ్మ" అంది మహాలక్ష్మి కస్తూరిని బుజ్జగిస్తూ.

"ఊహూ — నువ్వెంతో మంచి దానివి. నిన్నెందుకు కొట్టాలి బాబాయి చెప్పు?"

— నిష్కారణంగా తను భర్త చేతిలో దెబ్బ తిన్న మాట నిజమే. కాని తను త్వరగా వచ్చేస్తే బాగుండును. ఆలోచనలో పడింది మహాలక్ష్మి. బయటకు వెళ్ళిన భర్తని వూహించుకుంటూ.

"చెప్పు పిన్నీ ... అలా కొట్టడం తప్పు కదూ?" మీద చెయ్యేసి కుదుపుతూ అడిగింది కస్తూరి.

"ఏంలేదమ్మా, బాబాయికి మంచి వుద్యోగం వుంది. నెలకి బోలెడు జీతం వస్తుంది. ఆ డబ్బుతోనే కదా నాక్కూడా అన్నం, బట్ట అన్నీ వస్తున్నాయి! మరి అలాంటప్పుడు నన్ను కొట్టినా తప్పేమీలేదు గదా" అంది దుఃఖంతో వణుకుతున్న గొంతుని సవరించుకుంటూ.

"అయితే నువ్వుకూడా మంచి వుద్యోగం చేస్తే నువ్వుకూడా బోల్డు డబ్బు గడించే దానివి కదా. అప్పుడు నువ్వుకూడా బాబాయిని కొట్టేదానివా?" అంది కస్తూరి — మహాలక్ష్మి చీర కొంగుతో ఆమె కను కొలకుల్లోని నీరు వత్తుతూ.

గబుక్కున కస్తూరి నోరు తన చేత్తో మూసింది మహాలక్ష్మి.

"తప్పమ్మా తప్పు. అలా అనకూడదు.

> **రచయితలకు మనవి**
>
> స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం. —సం.

ను కూడా చదువుకుని వుద్యోగం చేస్తాడు ఆయనకి ఇష్టంలేని విధంగా ప్రవర్తించేదాన్ని కాదు. అంతే కాని మనం తిరిగి వాళ్లని తిట్టడం, కొట్టడం చేస్తే మహాపాపం. దేవుడు క్షమించడు. అందుకనే నువ్వు బాగా చదువుకో. బాగా చదువుకుంటే మంచి మొగుడొస్తాడు. ఎప్పుడూ ఇంట్లో అస్సలు గొడవలే వుండవు'' అంది మహాలక్ష్మి కస్తూరిని ముద్దు పెట్టుకుంటూ, తన సంసారంలో రగులుతున్న అగ్నిని ఆర్పుకునే సామర్థ్యం లేనందుకు ఏడుస్తూ.

ఏదో అర్థమయి, అర్థం కాకుండా వున్న

## కస్తూరి

మనోస్థితిలో పిచ్చివాడిలాగా చూస్తూ స్వీటు తినేసింది కస్తూరి. బాబాయి తనని కొట్టడాన్ని సమర్థించుకుంటున్న పిచ్చి మాటల్ని మాత్రం పూర్తిగా విశ్వసించలేక పోయింది.

ఆ తర్వాత ఒక సంవత్సరంలో చిదంబరం ప్రవర్తన మరీ విపరీతం కావడం, మహాలక్ష్మిని మాటిమాటికీ బాధించడం, అనుమానించడం, చదువురానిదనీ, తిండిదండగనీ సాధించడం. అతని అనుమానం ఆ శీలవతి ఆత్మహత్యకు కారణం కావడం కూడా జరిగిపోయేయి.

ఆ రోజుల్నుండీ ఆ చిన్నవయస్సు నుంచే భవిష్యత్తుకు సంబంధించి కొన్ని దృఢమైన అభిప్రాయాల్ని ఏర్పరచుకోవడం మొదలు పెట్టింది కస్తూరి. తను బాగా చదువుకోవాలి చదువుకుంది. మంచి ఉద్యోగం సంపాదించుకోవాలి — సంపాదించుకుంది. తనని భార్యగా ఎంచుకోవడం విషయంలో అతనేదో పొరబడ్డానని తనని పెళ్ళాడిన వ్యక్తి భావించకూడదు. అది మిగిలివున్న ఆశయం. అయినా భర్తే ఎక్కువ విద్యార్హతలు గలవాడూ, ఎక్కువ హోదాలో వున్నవాడు ఎందుకు కావాలి? భార్య ఎందుకు కాకూడదు? ఎవరో ఒకరు వేరొకర్ని ఏదో ఉద్ధరిస్తున్నామని అనుకున్నప్పుడుకదా సంసారంలో కలతలు వచ్చేది. తనకు సంబంధించి భర్తని మనస్ఫూర్తిగా గౌరవిస్తుంది. తనకంటే అన్ని విషయాల్లోనూ ఎక్కువ అర్హతలు వుండటం కాదు మంచి మనసున్న వ్యక్తి కావాలి తనకి. భర్త తక్కువ అర్హతలు గలవాడైనప్పటికీ, అతన్ని చులకన భావంతో చూడకుండా సమాన గౌరవం ఇచ్చి సుఖ సంసారాలు గడపవచ్చని తను నిరూపించాలి. పిన్నిలాగ, ఈ దేశంలోని మరెందరిలాగో తను కూడా బాధపడి, సంసారం నరకం చేసుకోకూడదు.

* * *

ప్రతి రాత్రిలాగే ఆ రాత్రీ గడిచి తెల్లారినప్పటికీ — కస్తూరికి ఆశాజనకంగానూ, ఆమె కుటుంబ సభ్యులకు ఆందోళనగానూ వుంది ఆ ఉషస్సు.

ప్రతివారికీ పెళ్ళి విషయంలో కస్తూరి ఏం చెప్తుందో తెలుసుకోవాలనే ఆత్రుతగా వున్నప్పటికీ— ఆమెని అడగడానికి ధైర్యం చాలక తమతమ పనుల్లో వున్నారు. రాత్రి చాలాసేపు తీవ్రంగా ఆలోచించినప్పటికీ, తన నిర్ణయంలో యింక మార్పులేమీ చేయగూడదని నిశ్చయించుకుని, కస్తూరి సుఖంగానే నిద్రపోయింది. గబగబా కాలకృత్యాలు తీర్చుకోవడంతో నిమగ్నురాలైపోయింది. కాఫీ త్రాగివచ్చి, హాలులో కూర్చుంది.

"నమస్కారం మేష్టారూ"

చెల్లెలికీ, తమ్ముడికీ ట్యూషన్ చెప్తున్న రవితో అంది కస్తూరి రోజూ లాగే.

"నమస్కారమండి" అని నమ్రతతో అని, లెఖ్ఖలు చెయ్యడంలో నిమగ్నుడయ్యాడు రవి.

కుర్చీలో కూర్చుని, న్యూసు పేపరు చేతిలోకి తీసుకుంది కస్తూరి. చదవ ప్రయత్నించింది కానీ పేపరంతా కళ్ళకి గజిబిజిగా కనిపించింది. ఆ అక్షరాలన్నీ ఒకచోట ప్రోగయ్యి ఒక మానవాకారాన్ని సంతరించుకుంటున్నాయి. మనస్సు లాగిన వైపు దృష్టి సారించింది నెమ్మదిగా.

తెల్లటి రంగు, నల్లటి ముంగురులు, గుండ్రటికళ్ళు, సూదిముక్కు, తెల్లటి పైజామా, లాల్చి — రవి మంచి చూపరి. పైగా ఈరోజు తన కళ్ళకి మరింత అందంగా కనిపిస్తున్నాడు. తనకు తెలియకుండానే తన మనస్సు ఈ రోజెందుకో అతనివైపు ఆకర్షితమవుతోంది. బహుశా రాత్రి తను తీసుకున్న తుది నిర్ణయానికి రూపకల్పన జరగబోతోందేమో!

ఓరకంటితో రవినే గమనిస్తూ కూర్చుంది కస్తూరి. అతని గురించిన వివరాల జ్ఞాపకాలు తరుముకొచ్చాయి.

## వారఫలం

మహేష్

15–7–1977 శుక్రవారం మొదలు
21–7–1977 గురువారం వరకు

**మేషం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభించగలదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. అనుకూలమైన సమాచారం అందగలదు.

**వృషభం :—** రావలసిన డబ్బు అందు తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్త్రీలకు — శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :—** ఫలితంలేని శ్రమకలుగు తుంది. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**సింహం :—** వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసినడబ్బు అందుతుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. అధిక వ్యయం జరుగు తుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడగలదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికిసౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య :—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలాక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీరు యిది వరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులను కొంటారు.

**వృశ్చికం :—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమకలుగు తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు.

ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగు తుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

ధనుస్సు :— మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలోఆందో ళన కలుగు తుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వారం ఆఖరులో మీ కార్య క్రమాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కార్యక్రమాల్లో పాల్గొం టారు.

మకరం :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగు తుంది. రావలసిన డబ్బు అందు తుంది. ప్రయో జనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — కుటుంబ వ్యవహా రాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

కుంభం :— సాహసిక వ్యవహారాలు బాగుం టాయి. వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభించగలవు. స్త్రీలకు —ఆరో గ్యం బాగుంటుంది. ఆడంబరంకోసం వ్యయం జరుగు తుంది.

మీనం :— ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. విద్యా వైజ్ఞా నిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగ లవు. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

---

రవి బి. ఎస్. ఎస్. యల్. సి. చదివాడు. మంచి తెలివి తేటలు వున్నవాడు. అతని పై చదువులకి బీదతనం అడ్డొచ్చింది. ఊళ్ళో ట్యూషను చెప్పుకుని జీవనం సాగిస్తు న్నాడు. 'నా' అనేవాళ్ళెవరూ లేని ఒంటరి. చేయూత నిస్తే ఎంతటి ఉన్నత శిఖరాల నైనా సులభంగా అదిరోహించ గలడు

ట్యూషన్ చెప్పడం ముగించి వెళ్ళి పోయేడు రవి

అలాగే కూర్చుండి పోయింది కస్తూరి. ఎంత సేపు అలా కూర్చుందో ఆమెకు తెలియదు. ఆలోచించి, ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది. అన్యమనస్కంగానే లేచి, స్నాన భోజ నాదులు ముగించి, బ్యాంకుకి బయల్దే రింది. ఎదురుపడినప్పుడల్లా తన వివాహం విషయంలో ఏం చెప్తుందోనని ఆసక్తి చూపు తూనే వున్నారు అమ్మ, నాన్న 'ఈవాళ బ్యాంకుకి శలవు పెట్టుతున్నాను' అని అంటుందేమోనని చాలా ఆశపడుతున్నారు. ఆమె బ్యాంకుకి వెళ్ళడానికి సిద్ధపడుతూం డడం వారిలో నిరాశని, కోపాన్ని అధికం చేస్తోంది.

"నాన్నా — ఒక రెండు నిమిషాలు యిలా వస్తావా ?" అంది కస్తూరి హాలులోకి దారి తీస్తూ.

"అలాగేనమ్మా పద" అంటూ వుత్సా హంగా కస్తూరితో వచ్చి హాలులో కూర్చు న్నారు జానకి రామయ్యగారు.

రెండు నిమిషాలు మౌనంగా గడిచాయి.

వంటింటి గోడవారగా నిల్చుని, చెవులు రిక్కించి, కూతురేం చెప్తుందోనని ఆత్ర తగా ఎదురు చూస్తోంది సుభద్రమ్మగారు.

"నాన్నా! యుక్త వయస్సులో నాకు వివాహం చెయ్యడం పెద్దవాళ్ళుగా మీబాధ్యత, మీ ఆనందం. అయితే మీరు నిర్ణయించిన సంబంధం నాక్కూడా ఆమోదయోగ్యంగా వుండాలి కదా? నేను జీవితాంతం సుఖంగా వుండడమే గదా మీకు కావల్సినది?"

పెళ్ళి విషయం తనతో శాంతంగా చర్చించడానికి కూతురు ఇష్టపడటం ఆయనకి చాలా ఆనందాన్నిచ్చింది.

"అవునమ్మా...అవును... ఎవరో ఒక ర్ని తెచ్చి నీకు ముడి పెట్టి, చేతులు దులుపుకో వాలని మేమూ అనుకోవడంలేదు. చదువుకుని చక్కటి ఉద్యోగం చేస్తున్న వ్యక్తిని నీకిచ్చి వివాహం జరపాలనేదే మా వుద్దేశ్యం కూడా. అందుకనే నిన్న జగన్నాధం తెచ్చిన సంబంధం నీకు అన్ని విధాలా సరిపోయేదని చేశాం భావి స్తున్నాం. కాదనకు"— ఆమె చేతులు తన చేతుల్లోకి తీసుకుని వాత్సల్యంతో అన్నారు జానకిరామయ్యగారు.

కస్తూరి అదోలాగ నవ్వింది. ఆ నవ్వుకి అర్థమేమిటో ఆయనకి అర్థమయ్యింది కాదు.

"అందరి తల్లిదండ్రుల్లాగే మీరూ ఆలోచించారు. ఇందులో నాకు ఆశ్చర్యం ఏమీ లేదు. పైగా ఆనందంగా కూడా వుంది. కానైతే నా ఆశయాలు నెరవేరాలంటే... నేను వివాహం చేసుకోవల్సింది మీరు చెప్పి నటువంటి వ్యక్తిని కాదు..." అని ఏదో చెప్పబోయి, ఆగి, తలదించుకుని, ఓ క్షణం తటపటాయించి, ధైర్యం తెచ్చుకుని, చటు క్కున తలెత్తి, "...రవిలాంటి వ్యక్తిని" అంది నెమ్మదిగా.

"కస్తూరీ...!!!"

—కన్నబిడ్డ కళ్ళెదురుగా కాలుజారి ప్రవ హంలోపడి, కొట్టుకుపోతుండగా కన్న తండ్రి గుండెలు చీల్చుకువచ్చే హృదయవిదారకమైన కేక అది.

"అవున్నాన్నా. నా నిర్ణయంలో తిరుగు లేదు. క్షమించండి. మీ ఆమోదాన్ని అర్థిస్తు న్నాను" అని, బ్యాగ్ తీసుకుని, గబగబా గడపదాటి బ్యాంకుకి బయల్దేరింది కస్తూరి.

...పగలబోతూన్న అగ్నిపర్వతం కంపిస్తూ న్నట్టు— వేడెక్కి నరనరాల్లోని రక్తం అన్ని వైపుల్నుంచీ శరీరాన్ని చింపుకు బయట పడాలని ప్రయత్నిస్తూండగా తలని రెండు చేతుల్తోటీ నొక్కిపట్టి, అలాగే వెనక్కి జారగిలపడిపోయేరు జానకిరామయ్యగారు.

[వచ్చేవారం మూడో భాగం
రచన మైనంపాటి భాస్కర్]

---

## సత్యం

చీకటి వుండాలి
లేకపోతే వెలుతురుకు
విలువ లేదు!
కష్టాలు రావాలి
రాకపోతే సుఖాలకు
విలలేదు!!
ఆశలు ఆరిపోవద్దు
ఆవేశం గుండెలోనుండి పారిపోకద్దు!
ఆశల పందిరి పైనే
ఆశయాలు పల్లవిస్తాయి!
అందరూ అందలాన్నెక్కితే
మోసేదెవ్వరు ?
అందరూ వినోదాన్నే కోరితే
విషాదాన్ని చేరదీసేదెవ్వరు ?
చిరు చేదు చవిచూసేనే
తీపి రుచి తెలుస్తుంది!
బతుకును గులాబీల
శయ్యగా నిర్వచించుకో
కానీ, గులాబీలకు
ముళ్ళుంటాయని గుర్తుంచుకో

— టి. గౌరీశంకర్

# పాలాక్షుని డైరీ

## తిరుగులేని తీర్పు

ప్రజలచేతిలో ఓటుంది. ఆ ఓటుకురాష్ట్రాన్ని అలాగే దేశాన్ని పాలించే మనిషిని ఎన్నుకునే హక్కుంది. వెనుకటికి పట్టపేనుగ తొండానికో హారాన్నిచ్చి కూడాబడి, ఆ ఏనుగ ఎవరి మెళ్లో దండేస్తే వాడే ఆదేశ రాజ్యానాధుడని అతడనాధుడైనా సరే విచారింపక నిర్ణయించేవారు. అలనాటి ఏనుగుచేతిహారంలా యీ నాటి పౌరుని చేతిలో ఓటుంది. ప్రస్తుతం ప్రజల ఎన్నికకు దేశం ఒప్పుకోవాలి. ఇందిరాగాంధి ప్రభుత్వాన్ని దింపి కేంద్రం జనతాచేతికి ఒప్పగించింది. అదే ప్రజ తమిళనాడును ప్రఖ్యాత నటుడు యం. జి. రామచంద్రనుకు ఒప్పగించింది. ఆ పని మంచిదన్న వాడిపని మంచిదికాదని కానీ, ప్రజల ఎన్నికెక్కడ దెబ్బతిందనిగానీ అనరాదు కదా — ముడియాదు.

## రోగవిముక్తికి వెళ్తే...

కొత్తూరుచిన్నతాండా అనే ఊరికి చెందిన 30 ళ్ళ ఆరుముగం అనే అతన్ని చాలా కాలంగా చాలా రకాల చిల్లర రోగాలు పట్టుకు పీడించడం ఆరంభించాయట. ఏదైనా పెద్ద ఆసుపత్రిలో ఒళ్ళు చూపించుక తీరాలని అతను నిర్ణయించుకుని సేలం బయల్దేరి రైలుదిగి, ఊళ్లోకి అడుగు పెడ్తుండగా ఆ దారిన ఊరొదలిపోతున్న లారీ సర్రునతని మీంచిపోయి, అతన్ని నలిపిచంపి స్థిరపడ్డదట.

### ఇందిరాగాంధి యింటి విషయం — దేశాయి సమాధానం

శ్రీమతి ఇందిరాగాంధి డిల్లీలోని మెరాలీ అనే చోట కట్టుకుంటున్న యిల్లులో నేలలో కొన్ని గదులు కట్టుతున్నట్టు (చల్లదనంకోసం భూమిలో కొన్ని గదులు కట్టారు.) స్విమ్మింగ్‌పూలు కూడా కట్టుస్తున్నట్టు పార్లమెంటులో జనతాసభ్యుడు కామత్ వెల్లడిచేసి, యీ విషయం మీద ప్రభుత్వం ఏం చేస్తున్నదీ, ముందు తీసుకున్న అంగీకరం ప్రకారం యిల్లు కట్టక, మార్పులు చేస్తున్న విషయం కేంద్రం ఏం చేయుదలచినదీ ఆ మాటా పడిగారట. ఇందిరాగాంధి విషయంలో దయాదాక్షిణ్యాలు జనతా ప్రభుత్వం చూపిస్తోందని మరొక జనతా సభ్యుడంటే మొరార్జీదేశాయ్ సమాధానం చెప్తూ ఇలా చిన్న చిన్న విషయం ఎక్కలాగరాదు. ప్రభుత్వం ఎవరికి కష్టం కలిగించరాదు. ఏ విషయాన్ని ఎంతవరకూ పరిశీలించాలో ప్రభుత్వం పరిశీలిస్తున్నది. అన్నారట—కాదా మరి! నా గవర్నమెంట్ హేజ్ బెటర్ థింగ్స్ అండ్ స్ట్రాంగ్ ప్రాబ్లెమ్స్‌టూ...

* * *

కాంగ్రెసులోంచి ఇందిరాగాంధి తొలగి పోవాలని టి. ఏ. పాయ్ కోరారట. బ్రహ్మానందరెడ్డి ప్రస్తుతపు తన పదవిని వదలెయ్యాలని కర్ణాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అరసు కోరారట — అనక! వెయిటింగ్స్ !

### పాము కాటువల్ల మంత్రగాని భార్య మృతి

ధారమంగళానికి చెందిన పొన్నప్పన్ అనేఅతను తేలు, పాము కాటులకు మందులు మంత్రాలు వేస్తూ జీవనాధారం ఆ వృత్తిగా పెట్టకున్నాడట. అతని భార్య 30 ఏళ్ళ అంగమ్మకు పొలంలో పాముకరిచిందట. భార్యకు తానే వైద్యం, మంత్రం వంటివన్నీచేసి, వేసిచూశాడట. ఈ కాలాతీతం వల్ల ఆమందులకు, మంత్రాలకూ ఫలితంలేనందువల్లా ఆమె చనిపోయిందట.

### అక్కని అనుమానంతో హత్య చేసిన తమ్ముడు

తెన్‌కురిచ్చిఅనే ఊరిలో 22 ఏళ్ళముత్తుమణి అనే అతను, అతని అప్పగారు 25 ఏళ్ళ కాత్యాయినికలసి వుండేవారట. పెళ్ళికాని కాత్యాయిని ప్రవర్తన మీద అనుమానం కలిగి, అది నమ్మకంగా తయారై దాంతో ఆవేశం వచ్చి, ఆతను ఆమెను ఏ మిషమీద అడవికి తీసుకు వెళ్ళి, అక్కడ చంపేసి గొయ్యితీసి పాతిపెట్టి చక్కా వచ్చేశాడట. కానీ పోలీసులు వాసనపట్టి అతన్ని నాలుగుతికి నిజాన్ని కక్కించి ఆ కాత్యాయిని శవాన్ని బయటికితీసి అతన్ని అరెస్టు చేశారట.

### కిరోసిన్ స్టౌ ప్రేలి ఇల్లాలి మృతి

నాల్నెల్ల క్రితమే వివాహమైన ధనలక్ష్మి అనే యిరవైయ్యేళ్ళమ్మాయి సేలంలో తనభర్తకు వంట చేస్తుండగా కిరోసిన్‌స్టౌ ప్రేలి, వొళ్ళంతా కిరసనాయిలుచిమ్మి, నిప్పంటుకు భర్త కరుప్పణ్ణ ఆచారి అడ్డొచ్చేలోగానే భగ్గున మండి చనిపోయిందట.

### అవీ—యివీ—అన్నీ

**దరి చేరని పక్షులు—**

నవల, రచన శ్రీమతి పెన్నేరుపాప, ప్రచురణ : ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కాంగ్రెసు ఆఫీసురోడ్డు, విజయవాడ— 2.వెలరూ7—00 మా కార్యాలయానికి చేరింది.

**మంచికి మెట్లెక్కడ**

నవల— రచన,భరత్‌కుమార్, ప్రచురణ, సాహితీప్రియ పబ్లికేషన్స్, విజయవాడ—3, వెల రూ 8—50 మా కార్యాలయం చేరింది.

# తమసోమా జ్యోతిర్గమయ

(11 వ పేజీ తరువాయి)

దివరి దారినవారు ఇంటి ముఖం పట్టారు, ఎలమ్మ తోట కూడలిలో బస్సుదిగి... రెండడుగులు ఇంటివైపు వేసేసరికి, అప్పుడు జ్ఞాపకం వచ్చింది సుజాతకు, తను రికార్డు షీట్స్ కొనాలని!

పక్కనేఉన్న పుస్తకాల షాపులో కావలసినవి కొనుక్కొని షాపు మెట్లుదిగ బోతుంటే...

శేఖర్. ఎదురుగా ప్రత్యక్షమయాడు.

"హలో గుడీవినింగ్" అన్నాడు నవ్వుతూ.

"ఓ ... మీరా" అని పలకరించి "వస్తానండి" అంటూ కదిలింది సుజాత.

"చూడండి ఒక్కమాట"

సుజాత ఆగి ఏమిటన్నట్లు చూసింది.

"చాలా రోజులుగా అనుకుంటున్నాను. మీతో మాట్లాడాలని. కానీ వీలుచిక్కడం లేదు. ఆనాడు మాట్లాడాలని మీ కోసం బస్ స్టాప్‌లో ఆగాను. కానీ మీ వెంట రజని కూడా వచ్చింది. మీకు అభ్యంతరం లేకపోతే.."

సుజాత ఒక్క క్షణం ఆలోచించి ... "చెప్పండి" అంది.

"పదండి! నడుస్తూ మాట్లాడుకుందాం" అని శేఖర్ మెట్లుదిగాడు. అతని వెనుకనే తనూ దిగింది సుజాత.

రెండడుగులు వేసిన తరువాత...

"నాకు ముక్కుకు సూటిగా వెళ్ళడం అలవాటు. అందుకే నేను చెప్పదలచుకున్నది సూటిగానే చెప్తాను" అని క్షణం ఊరుకుని "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" అన్నాడు శేఖర్.

అతను అటువంటిదేదో అంటాడని ముందే ఊహించినా మరీ అంత నిర్మొహమ్మాటంగా అంటాడని అనుకోని సుజాత ముందు తెల్లబోయింది.

"నాకు తెలుసు మీకూ నేనంటే మనసుందని. ఒకరి మనసు ఒకరు తెలుసుకోవడానికి సమయమే ఇంతవరకూ రాలేదు" శేఖర్ చెప్పుకు పోతున్నాడు.

ఈ సారి సుజాత నెత్తిమీద పిడుగు పడినట్లు అదిరిపడింది.

"మిస్టర్ వాడ్యూ యూ మీన్" తమాయించుకొని, కోపంగా అంది.

కానీ శేఖర్ చలించలేదు. పైగా గమ్మత్తుగా నవ్వాడు "మీరలా అంటారని నాకు తెలుసు. పైగా అరుణ మీ స్నేహితురాలు కదా! ఆవిడ విషయం వదిలెయ్యండీ. మీకు నా మీద సందేహం అక్కర్లేదు. నన్ను మనస్ఫూర్తిగా నమ్మండి" అన్నాడు.

అతనలా మాట్లాడుతుంటే జవాబేమివ్వాలో తోచక సుజాత అవాక్కయింది.

సుజాత మాట్లాడక పోవడంతో శేఖరే అన్నాడు.

"మీరంటే నాకు చాలా అభిమానం, ఇష్టం! అఫ్‌కోర్స్... మీవంటి అందమైన ఆడపిల్లంటే యిష్టపడని మగాడెవడుంటాడు! అయినా నేను అదృష్టవంతుడిని కాబట్టే మీ అభిమానం నాకు దక్కింది. నాకు మొదటినుండి అనుమానంగానే ఉండేది. కానీ... మీకు వచ్చిన సంబంధాన్ని కాదన్నారని విన్నతరువాత మీరు కూడా నన్ను ప్రేమిస్తున్నారనే నమ్మకం స్థిరపడింది నాకు."

అతని మాటలు వింటూంటే తేళ్ళూ, జర్రులూ వంటిమీద పాకుతున్నట్టయింది సుజాతకు కోపాన్ని, అసహ్యాన్ని బలవంతంగా అదుపులో పెట్టుకుని అంది.

"అంటే మీ కోసమే .. నేను వివాహానికి యిష్టపడలేదని మీ ఉద్దేశం. అవునా ?"

"కాదా ?"

"కాదో... అవునో! ముందీ విషయం చెప్పండి. అరుణను మీరు ప్రేమించలేదా?"

శేఖర్ నవ్వాడు "ప్రేమా ?.. యస్... ఒక విధంగా ప్రేమించాననే చెప్పాలి కానీ... మిమ్మల్ని ప్రేమిస్తున్నంత గాఢంగా కాదు"

"అంత ఘాటుగా ప్రేమిస్తున్నారా, నన్ను ?"

"సందేహించకండి. మీకోసం ఏమైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాను చెప్పండి... ఏం చేసినా ప్రేమను నిరూపించమంటారు?" శేఖర్‌లో తెచ్చిపెట్టుకున్న ఆవేశం తొంగి చూసింది.

"నేను చెప్పినట్టే చేస్తారా ?"

"తప్పకుండ..."

"అయితే ఇటువంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు మానుకోండి. ఇటువంటి ఆలోచనలు మీ ఆరోగ్యానికి, నా జీవితానికి మంచివికావు"

శేఖర్... దెబ్బతిన్నట్లు చూశాడు.

సుజాత అతనివైపు చూడకుండా అంది! "అరుణ నాకు ప్రాణస్నేహితురాలు. ఆమె స్నేహితునిగానే మీరు నాకు తెలుసు. అరుణ మిమ్మల్ని ప్రేమించిందంటే... ఆమె ఎంత మూర్ఖమైన పని చేసిందో ఇప్పుడు అర్థమౌతున్నది నాకు. మీరేదో మంచివారని, మర్యాదస్తులని అనుకున్నానుగాని ఇంత స్కౌండ్రల్ అనుకోలేదు."

"సుజాతా" శేఖర్ కోపంగా అన్నాడు "మితిమీరి మాట్లాడుతున్నావ్ !"

సుజాత పేలవంగా నవ్వింది. "అవును మితిమీరే మాట్లాడుతున్నాను. నీ మాటలు విన్న తరువాత మొహాన ఉమ్మకుండా ఊరుకున్నందుకు నా మాటలు మితిమీరినట్టే కనిపిస్తాయి. మిస్టర్ శేఖర్ నీ నాటకం చాలా రోజులుగా కనిపెడుతున్నాను. నీ వెకిలి చేష్టలు, కుప్పిగంతులు సహించానంటే అది అరుణ మీద నాకున్న అభిమానం అంతేగాని నీ మీద ప్రేమతో కాదు. అరుణకు తెలిస్తే, తను బాధపడుతుంది. నువ్వేదో ఉత్తముడివని, తనను మనస్ఫూర్తిగా ప్రేమించావని పిచ్చి నమ్మకంతో ఉంది వెర్రిపిల్ల.

"జీవితమంటే తోలుబొమ్మలాట కాదు

## అన్వేషణ

— "సుచంద్ర"

నిరంతరం సాగుతోంది అన్వేషణ
ప్రతి హృదంతరంలో రేగుతోంది గవేష
మూడక్షరాల ముచ్చటైన అభావన
లెవరికీ అందక అపురూపమవుతున్నాయి
కవుల కలాల్లో, బాలల కేరింతల్లో
కష్టజీవుల హాలాల్లో, బుద్ధిజీవుల
బోధల్లో
అస్పష్టంగా అగుపిస్తోందేకాని
అనంత రూపంగా కనబడదు; అందాక
ఆరాటం తగ్గదు ప్రతి మనసుకూ
యుగయుగాల పోరాటం పరిసమాప్తి
కానేకాదు
సమతా మమతలనే సొగసైన
ఆ సూర్యచంద్రుల తేజస్సు నిండితేగాని
ఈ చెత్తలోకపు తమస్సుకు 'గుడ్‌బై'
రాదు
చిత్తశుద్ధిగల వారి తపస్సు చరితార్థంకాదు
అంతవరకు సాగాల్సిందే యీ అన్వేషణ
నిరంతరం కొనసాగాల్సిందే యుగయుగా
లగవేషణ.

## తమసోమా జ్యోతిర్గమయ

శేఖర్! నీ ఆలోచనలు చాలా నీచమైనవి. నువ్వు చెప్తున్న ప్రేమ ప్రేమకాదు. అది ఆకర్షణ. మనసనేది నిర్మలమై, నిష్కామమై ఉండాలి. నీ మనసులో ఉన్న దంతా బూజు. మాటలకు తేనె పూస్తే ఆడపిల్లలు నమ్మి మోసపోతారనే నీ అంచనా పట్టి భ్రమ!"

"భ్రమ" శేఖర్ హుంకరించాడు. "పెళ్లి వద్దనుకున్న దానివి. నీకు నీతులేమిటి?"

"ఈ నీతులు నాకు కావు. నీ కోసం చెప్తున్నాను. అయినా నీకివి అర్థంకావు, నీ వంటి సంస్కార హీనున్ని, ద్విపాద పశువును మాటలతో నచ్చచెప్పలేనని నాకు తెలుసు. పెళ్లి చేసుకోనన్నాను కాబట్టి కాస్త తీయగా మాట్లాడితే నీ వలలో పడిపోతానను కున్నావ్! ఆడదన్నా, ఆడదాని మనసన్నా ఎంత చులకన నీకు! నీ వంటి లుచ్ఛా రాస్కెల్స్ ఉండబట్టే ఈ సమాజంలో ఆడదాని బ్రతుకు యిలా ఉంది. మళ్లీ ఇటు వంటి పిచ్చిపిచ్చి వాగుడు వాగితే మర్యాద దక్కదు జాగ్రత్త" అంది సుజాత లేని ధైర్యం తెచ్చుకొని.

"మర్యాదట మర్యాద! చూస్తాను" అని కసిగా హుంకరించి వెనుతిరిగి వడి వడిగా వెళ్లిపోయాడు శేఖర్.

కళ్లలో నిండిన నీరు బయటి ప్రపంచాన్ని మసకబరిస్తే కళ్లు తుడుచుకొని బరువెక్కిన మనసుతో ముందుకు అడుగు వేసింది సుజాత.

(ఇంకా ఉంది)

## డాక్టర్ సలహాలు

**కె. ఆర్ — నెల్లూరు**

నాకు 19 సం. లు. నడుము, పిరుదులు సన్నబడుటకు ఏమైనా మార్గాలు న్నాయా?

ప్రస్తుత పరిస్థితిలో కొన్ని పెద్ద పట్టణా లలో ఉదాహరణకు మీకు దగ్గరగా ఉన్న మద్రా సులో కొన్ని కేంద్రాలు ఇలా మీకు కావలసిన విధంగా చేసుకోవటానికి అవకాశాలున్నాయి. వీటన్నిటి పేర్లూ వ్రాయుటం ఇక్కడ సాధ్యం కాదు కాబట్టి నేరుగా వచ్చి, మీరే ఎంపిక చేసకో వచ్చు. సహాయం కావలసివస్తే మీ మేధాశక్తిని ఉపయోగించి తగిన వారిని లేక తెలిసిన వారిద్వారా సులభంగా వీటిని కనుగొనగలరు. [ఫోన్ వగైరా చేసి]ముందుగానే టైము తేదీ ఏర్పాట్లువగైరాలు చేసుకుని తర్వాత వెళ్లటం మంచిది.

ఇది మాత్రంగాక, తర్వాత ఆహార విషయంలో కూడా తగిన శ్రద్ధ చూపటం అవసరం. ఎక్సర్ సైజులు చేసి అలసి పోయి—ఆహారాన్ని ఐస్ క్రీంల రూపంలోనో, కాడ్‌బరీస్ చాకలెట్ ద్వారానో తీసికోవటం వల్ల శరీర బరువు తగక పోగా ఇంకా పెరుగుతుంది.

**పి. యస్. ఆర్ — చల్లపల్లి**

సిగరెట్లు త్రాగడం వల్ల గాయకుల గళం మారుతుందా?

మారే అవకాశం ఉన్నది— మితిమీరి ఏ పని చేసినా— తినగా తినగా గారెలు చేదన్నట్లు ఎక్కువగా పొగ పీల్చితే గొంతు గరగరలాడటం స్వరం మారటం జరుగవచ్చు. పైగా దగ్గు ఏర్పడి గుక్క పట్టి లేక— రాగంలోని మలుపు లలో కవి భావాలను తెలియ జెప్పలేక అపశ్రుతిగా మారే అవకాశం ఉన్నది. ఎప్పుడో ఒక సారు కాల్చడం వల్ల ఏ హానీ ఏర్పడదు.

**పి. వి. ఆర — ఒంగోలు**

మా అబ్బాయికి 1 సం లు 6 వ నెల నుండి చెవుకీ మూచ్చిలి గుంటకు మధ్యగా లోపల గడ్డ వచ్చినది 9వ నెల నుండి ఎడమ దవడ ఎముకకు క్రింద మరో గడ్డ వచ్చినది. వీటి వల్ల నొప్పి లేదు డాక్టరు టి. బి. గ్లాండ్స్ అని ఐసోనియాజిడ్ మాత్రలు వాడమన్నారు రెండు నెలల నుండి వాడినా ప్రయోజనము కన్పించలేదు. ఏమి చెయ్యాలి?

వైద్యుల సలహా సరి అయినదే అని నా నమ్మకం కూడా! ఈ మాత్రలు కనీసం 1సం విధి విరామం లేకుండా వాడటం ఎంతో అవసరం రెండు నెలలు మాత్రమే వాడి, ఫలితం కన్పించ లేదంటే ఆశ్చర్యం లేదు ఏ కారణం ఉన్నా ఈ మాత్రలను రోజూ మీ వైద్యులు సూచిం చిన ప్రకారం వాడటం తప్ప మీరు గాని, మరెవరు గాని చేయ గలిగిందేమీ లేదు. క్రమంగా వాడితే ఫలితం అత్యధికం

**ఎల్. కె — హైదరాబాద్**

నా వయస్సు 40 సం. లు గ్లాకోమా అయినందువలన రెండు కళ్ళకు ఆపరేషన్ చేయించుకున్నాను. తగ్గిన చూపు మెరుగుపడ టానికి యోగాసనాలవల్ల చన్నీటి శిరఃస్నానము వల్ల ప్రయోజనం వుంటుందా లేక హారీబెంజి మన్ గారి పుస్తకంలో సూచించిన పద్ధతుల వల్లగాని, రోజూ నిమ్మరసం, తేనె తీసుకోవటం వల్లగాని ఉపయోగం వుంటుందా తెలుప ప్రార్థన.

నాకు తెలిసినంతవరకు, నేత్రవైద్యుల సలహా పాటించమనటం, అనేదే! మిగతా వివరాలు [మీరు వ్రాసినవి] మీ నమ్మకాలను, ఓపికను బట్టి చేసిచూడండి. యోగాసనాలు వేసే ముందు నేత్ర వైద్యులకి చెప్పి వారు పరీక్షించేయటం [వేయటం] మంచిది.

—డా. కె. వెంకటేశ్వరరావు



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Str... Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# చందమామ రావే జాబిల్లి రావే

కొండెక్కి రావే పార్లే గ్లూకో తేవే

చిట్టి పొట్టి పాపలకు ఇష్టం

## పార్లే గ్లూకో మజా రుచితో... ఎంతో శక్తితో




పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్‌లలోని శక్తినిచ్చే తత్వం గల పోషక పదార్థాలతో నిండి వున్నాయి పార్లే గ్లూకో బిస్కట్లు.

పార్లే

గ్లూకో—భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్  వరల్డ్ సెలక్షన్ బహుమతి విజేత

everest/951/PP-tl